శ్రీ

# కుశలవపట్టాభిషేకము.

(ఆఱంకములు నాటకము)

గ్రంథకర్త

## రామనారాయణకవులు.

ప్రకటనకర్త

కందులగోవింద[illegible]

జనరల్ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1925.

 [వెల 0—12—0

ఈనాటకమందు వచ్చుపాత్రలు

పురుషులు.

రాముడు.

లక్ష్మణుడు.

భరతుడు.

శత్రుఘ్నుడు.

కుశుడు.

లవుడు.

వాల్మీకి.

వసిష్ఠుడు.

విశ్వామిత్రుడు.

నారదుడు.

మునికుమారుడు.

దుర్ముఖుడు.

జయంధరుడు.

సేవకుడు.

వెంకడు.

స్త్రీలు.

సీత.

ఎల్లి.





శ్రీ

# కుశలవపట్టాభిషేకము

ప్రథమాంకము.

రంగము:—[అయోధ్యయందు చాకలివీధి—ఎల్లిని వెంటాడుచు వెంకడు ప్రవేశించుచున్నాడు.]

ఎల్లి—(తొందరగాఁ బ్రవేశించి) నామాట యినకుండా కొట్తావేంటి ?

వెంక—యేంటి ! నీమాట యినడం. యింటూడంచబట్టే యింత కొంప తీశావు. ఇల్లాటిపనులు సేస్తావని ఎప్డూ అనుకుండలేదు. ఆ డెవడు. మక్కి లిరగవోడుస్తా. మహా రహచ్చం అనుతుండావే.

ఎల్లి—ఆడి జిమ్మ తియ్య. నాతో రహచ్చాలాడాడా ! సూసీ సూడని మాటలు.

వెంక—నాకండ్లతో సూడలే. నీబుద్ధి యియ్యాల తెల్సింది. అమ్మముండా యెంతదానవై నావు. నాకొంపలోంచి లెగిసిపో. నీకు దిక్కు యాడుందో సూస్తాను. (కొట్టును.)

ఎల్లి—ఏంటిది. గొడ్డుననుకొన్నావా యేంటి. మాపెట్టే వాడికిమల్లే కొడ్తావు.

[దుర్ముఖుఁడు - ప్రవేశించును.]

దుర్ము—(తనలో) ఈ రజకుఁడు తనసతిని నడువీధియందుఁ బరాభవించుచున్నాడు. (చాకలిని సమీపించి) ఓరీ ! నీకిది భార్యయే

యగునుగాక! అయినను నిట్లు రచ్చయందుఁగొట్టుట భావ్యమా? పొమ్ము. పొమ్ము. ఏదైన లోపమున్న నింట్లో బుద్ధిఁజెప్పుకొనుము.

వెంక—నువ్వేవరయ్యా దొరవు. మొగ్గూపెళ్ళాల దెబ్బాటమధ్య దూర్తావు. పూరుకోమంటావు. కొంపతీసే పనిచేస్తే. పెళ్ళాడిన ముండాకొడుకు పోవలసిందే. బేష్-ఁమాట సెప్పినావయ్యా. ఎల్లెల్లు. (భార్యనుజూచి) ఏవయినా సరే. ఇంకో గడైనా నాకొంపలో వుండొద్దు. నడువ్. (కొట్టును.)

ఎల్లి—ఇద్గో. సూడు. వొంటిమీద దెబ్బడ్డదంటే పెద్దమనుసుల్తో సెప్తాను.

వెంక—ఇదేం శ్రీరాముఁడనుకొన్నావా యేంటి? ఆడెవడూ. ఆ రావణుడెత్తుకపోయి ఏనదగ్గిఱ యేడాదుంచుకొన్న సీతమ్మ నేలడానికి. నాకేం పౌరుసం లేదనుకొన్నావా? నువ్వులేకపోతే నాకు గడవదనుకొన్నావా యేంటి. (కొట్టబోగా యెల్లి నిష్క్రమించును. వెంట వెంకడుగూడ నేగును.)

దుర్ము—(తనలో) ఈ చాకలిపోరున శ్రీరాముని సంగతికూడ వచ్చినది. నగరమున వార్తలారయుటకు నన్నే శ్రీరాముఁడేలపంపవలయును! పంపుగాక! ఈవీధికే యేలవచ్చితిని. వచ్చితినిగాక! వీరి పోరాటమున సీతామహాదేవినిఁకూర్చిన ప్రశంస యేలరావలయును! ఇప్పుడు నేనీమాటలు రామునితో నెట్లు జెప్పకుండ నుందును. ఒకవేళ నావలనను గాకపోయినను నాతఁడీవఁ వఁఱెవ్వరివలననైన విన్నమీదట, నేను చెప్పకుండ నుంటినని తెలిసి, నన్నుభక్తిశూన్యునిగాఁ దలపఁడా! ఏమైనను రాజకార్యము నెఱవేర్చుటయే ముఖ్యము.

(నిష్క్రమించును.)

రంగము:

[సభామందిరము - శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులు ప్రవేశించుచున్నారు.]

శ్రీరా—తమ్ములారా!

తే. గీ. మంచిపేరు బ్రతిష్ఠయు ♦ మహినిఁగాంచి
నట్టి కులమున జన్మించి ♦ నట్టి ధీరు
డపయశంబునుఁబొంది సౌ ♦ ఖ్యములుగనుట
కంటె మరణించుటే మేలు ♦ కాదె! జగతి.

లక్ష్మ—అగ్రజా! నీవు వక్కాణించినది సత్యమే. మర్త్యశంబంది భూతలంబున మహాభోగము లనుభవించుచు మనుటకంటె, దేహమువిడిచి శాశ్వత పరబ్రహ్మానందపదమును బొందుటయే యుత్తమము.

భర—ఆర్యు లిట్లేల చింతురు.

శత్రు—అగుగాక! ఈప్రశంస యిప్పుడేలవచ్చినది.

శ్రీరా—

చ. మనుకులమందుఁబుట్టి జన ♦ మాన్యుఁడు పంక్తిరథుండు తండ్రిగా
దనరఁగ; సంగరస్థలిని ♦ దైవతశత్రుల నుక్కడంచి స
న్మునులకుఁ బ్రీతిగూర్చి యశ♦ముం గొనియుండిన నేను గొప్ప నిం
దను భువి బొందినాడనని ♦ తద్దయుఁ గుందుచునుంటి నాత్మలోన్.

లక్ష్మ—అన్నయ్యా! ధరాభారనివారణార్థమై యవతరించిన పుణ్యపురుషుఁడవగు నీకుఁగూడ నిందయేనా? నిరంతర సత్కార్యాచరణదక్షుఁడవగు నీకిట్టిది కలుగుటేమి?

భర—

చ. పలుక వసత్యమెప్పుడును ♦ వైరులనైనను వేడుకొన్నచోఁ
దలఁతువు బ్రోవదప్పవు సు ♦ ధర్మపథంబున; దీనసంతతిన్

లలిత కటాక్షవీక్షణ వి ♦ లాసము మీ యంగబోత్రితు వట్టిచో
గలుగునె నీకు దుర్యశము ♦ కంజహితాన్వయ రత్నదీపకా.

శ్రీరా—లక్ష్మణా!

చ. మునులను నేచు రావణుని ♦ భూరిరణంబునఁ గూల్చి పిమ్మటన్
జనకనృపాలు పుత్త్రి భువి ♦ సాధ్వియటంచును నగ్ని హోత్రుఁడే
మనకుఁ బ్రసన్నుడై పలుక ♦ మానసమందున సంతసించి య
వ్వనిత గ్రహించినాడను; సు ♦ పర్వులు మెచ్చఁగ నీవెఱుంగవే.

లక్ష్మ—ఆవిషయమై యిప్పుడు సందియమేమియున్నది ?

శ్రీరా—ఆ దేవతాబృందమును, అనలుఁడును నాముఖప్రీతికై నా డట్లు పలికినంతనే నమ్మితిని.

లక్ష్మ—రామచంద్రా! నమ్మితివి. ఇప్పుడు లోపమేమి ? నేడు నీ వాక్యములు విపరీతముగ నున్నవి.

శ్రీరా—అట్లుకాదు. పరనారీ హరణమానసుండగు రావణుఁడు తస్క రించుకొనిపోయి యొకసంవత్సరము లంకయందుంచిన సీతను రాముడు రోషములేక మరల నేలుచున్నాడని—

లక్ష్మ—(కోపముతో) ఆ! ఏమీ! (ఇంచుక యూరకుండి) ఎవ్వఁ డవురా నీవు లక్ష్మణుని కోపాగ్నిఁ బ్రజ్వరిల్లఁజేసితివి.

చ. మది నిసుమంత భీతి, యను ♦ మానము బూనక జానకీసతిన్
మదమున నీగతిన్ బలుకు ♦ మానిసి బట్టి కరాసిఁ జీల్చి నె
మ్మదిని ముదంబునందెదను ♦ మానవనాయక వానిదెల్పు మీ
విదిత జగత్ప్రయైక భుజ ♦ విక్రమమూర్తిని నేను సైతునే.

భర—ఓరీ దుర్మార్గా! ఎవ్వడవురా నీవు ? భూదేవికిఁ బుత్త్రియై, జనకుని చేతలందు బెఱిగి, సకల సామంతరాజ కిరీటరత్నరుచి దీపితపాదసరోరుహుండగు శ్రీరాముని కర్థాంగియై, అగ్నిహోత్రు నిచేత వినుతిఁగాంచి పరమపావన గుణశీలయని జగద్విఖ్యాత

కీర్తినందిన సీతామహాదేవి నీగతిఁబలికి, ప్రాణములఁ గోల్పోవ సాహసించితివి కా ! నీకు వినాశకాల మాసన్న మగుట చేతనే యిట్లుపలికితివి. నీప్రాణములఁ గోల్పోవుటకు మత్కరాసి కొక నిమేషకాలమైనను బట్టదుసుమా !

శత్రు—(కోపముతో)

మ. అనుమానం బొకయింత పూనక సము ♦ ద్యత్పుణ్యచారిత్రి సీ
తను నీరీతిని నిందలం బల్కు నా ♦ ధర్మైకహీనున్ మదాం
ధుని శీర్షంబును వ్రక్కలించి కడుసం ♦ తోషంబు జేకూర్తు నీ
కును, నీనిందలత్రోఁ బనేను వినుమా ♦ కోదండరామ ప్రభూ.

లక్ష్మ—(క్రోధముతో) ఓరీ దురాత్మా !

చ. ధరణిజ నీవిధానఁ గడు ♦ ధర్మము నెంచక పల్కినట్టి దు
శ్చరితుని నిన్ను ఖడ్గమున ♦ సాహసమేర్పడ జంపివేయగా
బరువడివచ్చుచుండె నిదె ♦ వైరి భయంకరమూర్తి లక్ష్మణుం
డరయఁగ నా విరించి యిపు ♦ డడ్డమునిల్చిన నిన్నుఁ గాచునే.

(పోబోవును.)

శ్రీరా—(లక్ష్మణుని వారించి అందఱినిఁజూచి) తమ్ములారా ! ఈ యాగ్రహము మీరెవ్వరిపైనఁ జూపుదురు. మనము నోరు మూసికొనఁగలము కాని లోకము నెట్లుమూయఁగలము. నేను జెప్పువాక్యమును బూర్తిగ వినకముందే యాగ్రహాయత్త చిత్తులయిన నేనేమని పలుకఁగలను.

భర—నీవు చెప్పఁదలఁచిన దేదియో చెప్పుము.

శ్రీరా—దానవుఁడు చెఱఁబట్టుకొనిపోయిన కాంతను శ్రీరాముఁ డేలు చున్నాడని జనులాడు వాక్యములు నా శ్రవణరంధ్రముల నిశితోగ, బాణములవలె నాటినవి. దుర్యశమంది జీవించుటకన్న మరణమే మేలు.

లక్ష్మ—అన్నయ్యా !

తే. గీ. పామరులు బల్కు వాక్యముల్ ♦ పాటిజేసి
చింతఁ బొందంగ నీకేల ♦ స్వాంతమందు
జనక భూజానికూతురు ♦ సాధ్వి భువన
మాతయని లోకమెఱుఁగదే ♦ మానవేంద్ర.

శ్రీరా—తమ్ముఁడా ! అయిననేమి ? ఇట్టి దుర్యశమును భరించి నే నెట్లు జీవింపగలను ? కావున నే నొకసంగతిఁ జెప్పెద. మీరు వినుఁడు. మీరే నాకు బంధువులును, సఖులును, ధనమును, ప్రాణంబులును నై యున్నారు. నన్ను భక్తివిశ్వాసముల సేవించుచు రాజ్యధౌరేయునిగా జేసినారు. అట్టిమెడలఁ బ్రతి విషయమువిూతోఁ జెప్పవలసియున్నది నాపైఁబడిన యీనింద బాపుకొనుటకు సీతను పరిత్యజింపఁదలఁచితిని. మున్ను లంక యందు రావణ వధానంతరమున జానకిని స్వీకరింపననిపలుక, యామె యనలప్రవేశ మొనర్చినది. అప్పుడు అగ్నిహోత్రుఁడు సాక్షాత్కరించి జానకి మహాసాధ్వియని పలికెను ఇట్టి యప వాదలు వచ్చుననియే నేనప్పుడట్లు చేసితిని. కాని తప్పలేదు. సీత సాధ్వియైనను నామెను పరిత్యజించి యిక్ష్వాకువంశయశ మును రక్షించుకొనవలయును. ఈకారణమున నేను మీవది నను బరిత్యజించుచుంటినని మీరు విచారించవలదు. దుర్యశ మంది జీవించుటకన్న మరణించుటయే మేలు. అవసరమైనచో ప్రాణములను నంతకన్నఁ బ్రియమగు మిమ్ములనైనను విడిచె దను. (భరతునిఁజూచి తమ్ముఁడా ! భరతా !

ఉ. సీతను వీడకున్న గుణ ♦ శేఖర మ ద్యశమెల్లబోవు, బృ
ధ్వీతలమందుఁ ద ద్యశము ♦ వీడినఁ బ్రాణములేల, గాన, నా

సీతను దుర్గమోగ్రవన ♦ సీమను వేగమ డించివచ్చి నా
ఖ్యాతిని నిల్పుమయ్య ఘన ♦ గౌరవముంచుచుఁ గైకనందనా

భర—అన్నయ్యా ! ఇట్టిమాటలు బల్కెదవేటికి ?

మ. అనలంబైనను జొచ్చువాడను; సము ♦ ద్యద్దర్పమే పారఁగా
ఘనసంగ్రామమునందు దాకెదను పీ ♦ కన్ గాలునైనను మహాం
బునిధుల్ పుక్కిట బట్టెదన్; వినుము భూ♦ పుత్రిన్ విడన్ జాల, న
వ్వనదేశంబున, నంతపాపినె మదిన్ ♦ భావించి మన్నింపుమూ.

అగ్రజా ! నేను నిరంతరము భవదాజ్ఞా పరిపాలకుండనని యెఱుంగుము. కాని యివ్విషయము నన్యథా పలుకవలసివచ్చినందులకు క్షమింపుము.

ఉ. పామరుఁ డాడువాక్యములఁ ♦ బాటియొనర్చి ధరాత్మజాత, ను
ద్దామ భయంకరాటవుల ♦ దప్పక వీడుమటందువేల, యా
భామగుణంబు లీవెఱుఁగ ♦ వా జగమెల్ల నెఱుంగదా ! రఘు
స్వామి ! తలోదరీమణికి ♦ బాములఁగూర్చుట ధర్మమానెకో.

శ్రీరా—భరతా ! నీవు నాయాజ్ఞ కన్యథావర్తింపవలదు. సంశయంబువిడిచి సీత నరణ్యముల డించిరమ్ము.

తే. గీ. యశమునకు నాలవాలమై ♦ యలరుచున్న
రవికులంబునఁబుట్టిన ♦ రాముకీర్తి
యవనిలోన గలియుచుండ ♦ ననుజులైన
మీరు జూచుచు నైచుట ♦ మేలె తలఁప.

కావున ఓ కైకనందనా సందియము విడువుము.

భర—అన్నయ్యా ! పరమదారుణమైన యీ కృత్యము జేయుటకు నేను సాహసింపఁజాలనని చెప్పుచున్నందుకు నాయెడలఁ గిన్కవహింపవలదని ప్రార్థించుచున్నాను.

చ. క్షితిని సమస్తమున్ సుతుని ♦ చేతను నేలఁగ జేయ జానకీ
యుతముగ రామచంద్రుని మ ♦ హాగ్రవనంబుల కంపినట్టి దు
ర్మతియగు కైక పుత్రుఁడవు ♦ రాఘవ! నిందయువచ్చె, దానికిఁ
జతగ ధరాత్మజాతను వ ♦ నంబులకంపి మెలంగనేర్తునే.

అన్నయ్యా! నే నీకార్యము సేయఁజాల.

శ్రీరా—(తనలో) భరతుఁడు సీతయందున్న భక్తిచే నీకార్యము సేయుటకు సంశయించుటయే కాక పూర్వమువచ్చిన నిందను దలంచి భయంబందుచున్నాఁడు. ఈతఁడు సాధుగుణశీలుఁడగుటచే నిట్టికార్యముల సేయుటకు సాహసింపఁ బూనఁడు. కానిమ్ము. ఈకార్యమునందు శత్రుఘ్నుని నియోగించెదగాక! (శత్రుఘ్నుఁ జూచి) తమ్ముఁడా! శత్రుఘ్నా! నీవు శౌర్యధనుండవు. సమస్తవిషయము లెఱింగినవాడవు. మానవునకు నిందకన్న మరణమే శరణమును సంగతి బాగుగ గుర్తెఱింగినవాడవు.

చ. గురుఁడను నేను నీకు; నన ♦ ఘుఁడవు నీవు; మదాజ్ఞపైన, నా
ధరణిజఁ గొంచుఁబోయి యిఁక ♦ దప్పక కానన భూమి డించి, చె
చ్చెరఁ జనుదెంచి మద్యశము ♦ శిష్టజనావళి మెచ్చునట్లుగా
ధరణిని నిల్పుమయ్య ఘన ♦ ధన్యచరిత్ర సుమిత్రపుత్రకా.

శత్రు—అగ్రజా! భవదాజ్ఞ మేము నిరంతరము పాళించదాల్చి మెలంగవలసినదే. కాని నావిన్నప మొక్కటి యాలింపుము.

సీ. అవనిదేవికిఁ బుత్రి ♦ యైయొప్పి
ధరనియో నిజమైన ♦ తరళనేత్రి
రాజఋషిజనక ♦ రాజహస్తంబుల
ముద్దుగాఁ బెఱిగిన ♦ ముగుదమిన్న

బహుజనంబులచేతఁ ♦ బరమసాధ్వియటంచు
విఖ్యాతి గన్నట్టి ♦ విదుషిమోష్ఠి
నీ పాదసేవయే ♦ నిఖిలసౌఖ్యములంచు
భావించి మెలఁగెడు ♦ పద్మగంధి

తే. గీ. యట్టిజనకరాజ కుమారి ♦ నకట నేఁడు
పామరుం డాడుమాట భా ♦ వమునఁ దలఁచి
విపిన భూములయందున ♦ విడిచిరమ్మ
టంచు వచియింప ధర్మమా ♦ యవనిపాల.

ఆ జగన్మాతయందు మందునకైన నొకలోపము గనిపించునా? రామచంద్రా! నీచరణసేవకుఁడ నగు నావిన్నప మాలకించి నీయుద్యమ మునుమానుము. నేనిట్టి దుష్కరకృత్య మొనర్పఁజాలను.

శ్రీరా—(తనలో) శత్రుఘ్నుఁడుగూడ భరతుఁడు వచించినట్లే వచించుచున్నాఁడు. ఇట్టికార్య మొనర్చుట యెవ్వరికైనను గష్టమే కదా! నే నెట్లయినను నిక్కార్యము సౌమిత్రిచేతనే చేయింపవలయును. (లక్ష్మణునిఁ జూచి)

సీ. భక్తిచే నాయందు ♦ భాగ్యంబులనువీడి
వనులకు నావెంట ♦ వచ్చినావు
పదునాలుగేండ్లును ♦ పడరాని ఘనకష్ట
ములఁబొంది నాసేవ ♦ సలిపినావు
నను దైవముగ నెంచి ♦ యనిశంబు నతిప్రేమ
చిత్తమందునఁబూని ♦ చెలఁగినావు
నిరతంబు నాయాజ్ఞ ♦ శిరముపై ధరియించి
నిజమైన భటునిగా ♦ నెగడినావు

తే. గీ. నేఁడు దుర్భరకార్యంబు ♦ నీభుజంబు
నందు బెట్టుచున్నాఁడ నీ ♦ వందుకింక

వేరుమాటను బల్కక ♦ వేఁడిదీర్ప
వలయు నాయాజ్ఞ లక్ష్మణా ♦ లలితచరిత

బాల్యమాదిగ నాసౌఖ్యమే నీసౌఖ్యముగ భావించితివి. నిరంతరము నాశ్రేయమే కోరుచుందువు. నాకన్న జగంబున నీకు మఱియొకటి లేదనితలంచి వర్తించుచుంటివి. మీ రెవ్వరును నామాట వినకున్నచో నేనేమిసేయుదును. కావున మీవదినెయందలి భక్తిప్రేమలు పరిత్యజించి భయదారణ్యంబున విడిచిరమ్ము.

లక్ష్మ—అగ్రజా !

మ. జనకక్ష్మాధవపుత్రి రత్నవిలస ♦ త్సౌధాంతరావాస; పా
వనచారిత్రి త్వదీయపాదయుగ సే ♦ వాసక్త; నారీమణీ
జనలోకాభరణంబు; సీత నకటా ♦ శార్దూలభల్లూక ఖ
డ్గనితాంతంబగు భీకరాటవిని పి ♦ డన్ నాకుఁ జేయాడునే

చ. పరులకు ధర్మమున్ గఱపు ♦ భవ్యగుణాఢ్యుఁడవట్టి నీకు నే
కరణివచింపఁ జాలుదును ♦ గాని వచించుచునుంటి నన్నునున్
గరుణను జూడు మీయెడల ♦ క్ష్మాసుత సీతఁ నరణ్యవాటిలో
సరగున డించి రమ్మనుట ♦ కంజహితాన్వయదీప ! ధర్మమే.

సీ. ఏకాంతకై నీవు ♦ శ్రీకంఠు చాపంబు
భంగపఱచి కీర్తి ♦ బడసినావొ
ఏ రామకై నీవు ♦ క్రూరదైత్యుని విరాధు
నవలీల దున్మాడి ♦ యలరినావొ
ఏ లేమకై నీవు ♦ వాలినొకకోల
బడవేసి యినజుఁ జే ♦ పట్టినావొ
జలజాక్షికై ♦ నీవు లోకములేచు
దశశిరస్కుని దున్మి ♦ తనరినావొ

తే. గీ. అట్టి యర్ధాంగి గుణశీల ♦ యమలచరిత
సతత భవదీయ సత్పాద ♦ జలజసేవ
కాని, యన్యమెఱుంగని ♦ కాంత, యట్టి
సీత విడనాడ ధర్మమే ♦ క్షితితలేంద్ర.

మ. పరుసాగ్రేశులు భీకరాటవి వసిం ♦ పంబోవ నీవెంట స
మ్మదమేపారఁగవచ్చి భక్తిని సుఖం ♦ బుల్ దుఃఖముల్ జూడకే
పదదాస్యం బొనరించి నీకుఁ ద్రిజగ ♦ త్ప్రఖ్యాతి నార్జించె నా
మదిరాక్షిన్ వనభూమి కిట్లు మరలం ♦ బాపింపఁగా ధర్మమే.

దేవా! రామచంద్రా! పామరులు పలుకు మాటలను బాటించి నీ విట్లు సేయనెంచుట యేటిధర్మము. సీతామహాదేవి సుగుణములు నీవెఱుఁగవా! ఇంతకుమున్ను నీవు పరీక్షించలేదా!

మ. అలనాఁ డాదశకంఠు పట్టణములో ♦ నాయగ్ని యే తెంచి యీ
జలజాతాక్షి ధరాకుమారిక మహా ♦ సాధ్వీశిరోరత్న మీ
కలికిన్ వేగ్రహియింపుమీ యికను శం ♦ కన్ వీడియుంచుమ్ సుని
శ్చల చిత్తంబున బల్కుటీవు వినవే ♦ క్ష్మాపాల చూడామణీ.

అట్టి సీతకా మరల నీవిట్టి సంకటములు గల్పింపఁ దలంచితివి? రామచంద్రా! సీత కట్టి నలుగులు కల్పింపవలదని నేను బ్రార్థించు చున్నాను.

భర — అగ్రజా!

మ. ఎవఁడో పామరుఁ డాడుపల్కులను నీ ♦ వీరీతి నాలించి యా
భువిపుత్రిన్ వన సీమకంపెదు తలం ♦ పుల్ బూనఁగాఁ జెల్లునే
యవివేకుల్ బలురీతులన్ బలుక స ♦ త్యంబూడునే యంచు ధ
ర్మవిచారంబున నీకు సాటి గలరే ♦ రామా! విచారింపుమా.

శ్రీరా — తమ్ముడా! భరతా! నీవు ప్రపంచవర్తనము నెఱుంగఁజాలక యుంటివి

తే. గీ. మనుజు లొనరించు దోషముల్ ♦ బయలుబడుప
నార్యు లెప్పుడు భయమును ♦ నందుచుందు
హీను లేసుమా తమ్ముడా ♦ యిట్టి వెపుఁ
వెల్లడించుచు నుందురు ♦ పృథ్వియందు

హీనుల నోటనుండి యిట్టినుడి వెలువడినదని మనము తీసివేయరాదు. యశోహీనుఁడగు మానవుఁడు ప్రాణముల భరించియుండినను మరణించిన వానితోఁ దుల్యునిగనే భావింపవలయును. మన ప్రభాకరకుల మనాదినుండియు సత్యధర్మములకు నిలయమై యశముచేతనే వర్ధిల్లుచున్నది. అట్టిదానికి మన మిప్పుడు భంగముకలిగింపరాదు. అగ్నిసాక్షిగ నేను చేపట్టినసీత. అయోనిజయైనసీత అనలునిచే సాధ్వీమణి యని సాక్ష్యమిప్పించినసీత. నాకనుకూలవతియగు సీత. అట్టి యకాంతను లోకాపవాదమునకు భయమంది నేను పరిత్యజింపఁ దలంచితిని. ఇఁక మీరు నాయుద్యమమున కడ్డు గల్పింపవలదు.

శత్రు—ప్రభాకరకులదీపా ! రామచంద్రభూపా !

సీ. మంచికోడలటంచు ♦ మనతండ్రిచేతను
మన్ననఁగాంచిన ♦ మగువమిన్న
నిజసతీ భావంబు ♦ నీకుఁజూపఁగనగ్నిఁ
జొచ్చి యశముగొన్న ♦ శుభచరిత్రి
నినుఁబాసి లంకలో ♦ నిద్రాహారము లేక
కాలంబు గడపిన ♦ కలుషరహిత
జనక భూమీశ్వరు ♦ సత్కీర్తిలతఁబ్రాక
జేసి వెలసిన ♦ భాసురాంగి

తే. గీ. అట్టిసీతను నింతఁ జా ♦ లాలి నకట
యతిభయంకర వనముల ♦ కంప నేల

వలదు నీకిట్టి సీత నా ♦ పలుకు వినుము
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర.

శ్రీరా—తమ్ములారా! ఏల మీ రీవిధమునఁ బలికెదరు?

చ. పడతియె సర్వసౌఖ్యములు ♦ స్వర్గమునయ్యెడె యంచు దాని నీ
మెడకు బెనంగ వేసికొని ♦ మేదినిపైఁ జరియించువాఁడు మీ
నుడులు సహింపనోపును; జ ♦ నుల్ వచియించెడు నిందకోడి యీ
పడతిని వీడనున్న రఘు ♦ వర్యుఁడు సైచునే మీకు వాక్యముల్

ఇఁక నూరకొనుఁడు. మీవాక్చాతురికి మెచ్చితిని. బంధువులను వదలుట దుర్యశమందుటకన్న శ్రేయమని తలంచితిరి కాబోలు! లక్ష్మణా! ఇదివఱ కెప్పుడును నాయాజ్ఞ దాటినవాఁడవు కావు. ఇప్పుడు మాత్రము దాటుచున్నావు.

లక్ష్మ—(తనలో) అగ్రజున కాగ్రహము కలిగినది. మేము చెప్పెడు వాక్యములు వినఁడయ్యె. ఇక నేనేమి సేయుదును! ఈ మహానుభావుఁడు తన పూన్కిని విడుచువాఁడు కాఁడు. (ఇంచుక యూరకుండి) హా! విధీ! ఎట్టి క్రూరకర్మము సేయుచుంటివి.

తే. గీ. పట్టపుందేవి యగుచును ♦ భాసిలంగ
నరయఁజాలక కానల ♦ కంపినావు
చాలకది నేడు మరల యీ ♦ సాధ్వికిట్లు
నింద గూర్చితి వకట! యే ♦ మందు నిన్ను.

ఔరా! నీవెంత కఠిన హృదయుఁడవు. నీ యొనర్చు కృత్యములన్నియు నిట్లే యుండును. మేము నీ మొదలఁ జేసిన మహాపరాధ మేమి యున్నదో తెలియదు. (ఆలోచించి) సరి సరి జ్ఞప్తికి వచ్చినది.

తే. గీ. దశముఖుండు మన్నఁడు ♦ వాని దర్పమార్చి
నామనుచు మాకుగీడు నొ ♦ నర్పలేక

పూతచారిత్రయైనట్టి ♦ సీత కిట్లు
గష్టములఁ గూర్చుచుంటివి ♦ కఠినచిత్త
పితామహుండవని గర్వించుచుంటివి కాంభోలు.

చ. మనుమనిఁ జంపినారనెడు ♦ మాటను నే మిపు డీవు చూడుమా
జనకజపైన నిందలిడి ♦ క్ష్మాపతి, ప్రేమ పరిత్యజించి యా
వనిత నరణ్యభూములకు ♦ బంపగ సల్పుచునున్న నిన్నునున్
దునుమక పీడదే యిపుడు ♦ దోర్బల విక్రమ ముల్లసిల్లఁగన్.

(ముందునకుఁ బోవుచున్నాడు.)

శ్రీరా—(లక్ష్మణునిఁ బట్టుకొని) లక్ష్మణా! బ్రహ్మపై నీయాగ్రహము జూపుచుంటివా! ఇంత యవివేకి వైతివేమి? ఇటు చూడుము.

చ. కులమున దుర్యశంబు నొనఁ ♦ గూర్చిన సీతనుజంపు లేనిచోఁ
గలికిని పీడలేక యిటు ♦ గాసిలుచుండిన నన్నుఁజంపి ని
ర్మల రవివంశమందున, వి ♦ రాజిత సద్యశముండజేసి భా
సిలు మిఁక సంశయం బిపుడు ♦ చిత్తమునందున బాతిదోలుచున్.

ఈ నాయొక్క మాటవిని యావల మీఱియిచ్చు వచ్చినట్లు జేయుఁడు.

తే. నగరమున సీతయుండిన ♦ నాదుబ్రదుకు
సున్న, నేనుకల్గిన సీత ♦ సున్న; కాన
వదినెపై మీకు బ్రేముడి ♦ వరలుచున్న
జనెద నేను; సుఖంబుల ♦ గనుఁడు మీరు.

(ముందునకు నడచుచున్నాడు.)

లక్ష్మ—(వారించి అగ్రజా! ఏమిది! మీరులేని యీనగరంబున మేముం దుమా! ఈ భాగ్య భోగముల ననుభవింతుమా. మా కివి యన్నియుఁ గావలయునా? మీ రెక్కడనున్న మేమును నక్కడనే యుందుము.

శ్రీరా—తమ్ములారా! ఎందుకీ మాటలు. మీ కుహనాభక్తి యంతయు నేడు వెల్లడియైనది. కాకున్నచో నాయాజ్ఞ మీరు నతిక్రమింతురా! అగ్రజుడు దుర్యశమంది యుండఁగాఁ జూచి సహింతురా? ఇది యంతయు మిమ్ముల నననేల? దుర్యశమంది నేనేల జీవించి యుండవలయును?

తే. గీ. తన్వి యపవాదఁగాంచెను ♦ తమ్ము లెవరు
మాటవినకుండి రింక నీ ♦ మాడ్కి నేను
ప్రాణములతో నిలిచిన లా ♦ భంబులేదు
ఖడ్గమా! చంపుమా నన్నుఁ ♦ గరుణఁబూని.

(నఱుకుకొనఁ బోవుచున్నాడు.)

లక్ష్మ—(శ్రీరాముని చేతనుండి ఖడ్గము తీసికొని)

మ. జననిందల్ వెడబాపుకోఁదలచి యా ♦ యన్నపుత్రికల్ ఘోరకా
ననభూమిన్ విడనాడి రమ్మనిన య ♦ న్నన్ జంపఁగా జూచెదే
వనితల్ సాధ్విసఁ లోకమాత, వని డిం ♦ పన్ జూచె నీకున్మదుల్
ఘనకారుణ్యము బూని చంపు మిపుడే ♦ ఖడ్గంబ! ప్రార్థించెదన్.

(నఱుకుకొనఁ బోవుచున్నాడు.)

భర—(వారించి) లక్ష్మణా! మీ వెఱ్ఱితనమునకు నవ్వు వచ్చుచున్నది. చాలుఁ జాలు.

శ్రీరా—తమ్ములారా! ఈ మాటలతో నేమి పనియున్నది. నాతుది సారి పలుకు వినుఁడు.

తే. గీ. నాకు భార్యగా నొప్పి యా ♦ నాఁటిమిన్న
చేయవలసిన సేవలఁ ♦ జేసియలరె
యామెకును నాకు నేటితో ♦ ననుజులార
దీరె, నిఁక నేల మీరలు ♦ మాఱుపలుక.

లక్ష్మణా! నీవే సీతను నరణ్య భూములయందు డించి రమ్ము. మారు పలుకవలదు.

లక్ష్మ—(తనలో) ఇప్పుడు నేనేమి సేయుదును. ఈ మహాత్ముని యాజ్ఞ యనుల్లంఘ్యనీయము. ఇక నే నీకార్యము చేయక తప్పదు.

చ. వలదిదియంచు మేను పలు ♦ భంగుల వేడిన నింత యేనియున్
దలఁచక జానకిన్ వనుల ♦ దప్పక వీడుమటంచు నాజ్ఞ నా
కిడెను రఘూద్వహుం డకట ♦ యిట్టులె కాలము బుచ్చునట్టులా
జలజభవుండు నెన్నుదుద ♦ జానకికిన్ లిఖియింపఁ దప్పునే.

అక్కటా! ఈ దారుణకార్యము నేను చేయవలసి వచ్చినది.

చ. వనముల కేగుదెంచి కడు ♦ భక్తిమెయిన్ నను నగ్రజున్ మనం
బునఁ గడుభక్తిఁ బూని జన ♦ ముల్ పొగడంగను సల్పె సేవ లీ
యనఘుఁడు లక్ష్మణుం డనుచు ♦ నంచితప్రేమను బల్కు జానకిన్
జననుత సచ్చరిత్రను వ ♦ నంబుల డింపగనుంటి నక్కటా.

ఉ. ఆ విధి మేఘనాథుని ఘ ♦ నాహవ భూమిని దాకి వాసిచేఁ
జావక యుంట నే డకట ♦ సజ్జనులెల్లరు నన్నుదూర, సీ
తావనితన్ గుణాఢ్యను సు ♦ ధర్మచరిత్రను గాననాళిలో
నీవిధి డించి వచ్చుటకె ♦ ఈ యపవాదను నేనుగొంటకే.

(ఇంచుక యూరకుండి సీత నుద్దేశించి) హా! మాతా! సమస్త సద్గుణ వ్రాతా! సీతా! నీ కెట్టి దుర్గతి సంభవించినది.

చ. ఎలమిని భూమిదేవికి జ ♦ నించి విదేహ నృపాలు బిడ్డవై
యలరి, గుణాఢ్యుఁడౌ దశర ♦ థావనినాథుని పెద్దకోడలై
కలితపరాక్రముండు రఘు ♦ కాంతుసికిన్ సతియయ్యు నక్కటా
కలనయినన్ సుఖంబులను ♦ గాంచియెఱుంగదు సీతయక్కటా.

అమ్మా! నీవు మాయింట నడుగు బెట్టక పూర్వము మీజనకుని యింట నేమి సుఖంబులను బొందితివో గాని, యిచ్చట మాత్రము సుఖంబుల నెఱుగవు. కైక వరంబుల కారణంబున నడవులకు శ్రీరామచంద్రునితో నరుదెంచి యనేక కష్టంబులఁ బడతివి. పర్ణశాలయందుండఁగా రావణునిచే లంకకుఁ గొనిపోవఁబడి యొక వత్సరమందనేక యిడుమలఁ బడితివి. తల్లీ! కష్టములు గట్టెక్కినవని తలంచితిని. ఇంతలో నిట్లగునని తలంపలేదు.

శ్రీరా—తమ్ముఁడా! జానకిని నరణ్యమున నొంటి విడిచి వత్తునా యని శకించుచుంటివా యేమి! నీ కట్టి శంకవలదు. మీవదినె గంగాతీరారణ్య ప్రదేశంబులందుండు మునికన్యల సందర్శింపఁ గోరిక కలదని నాకు వచించి యున్నది. కావున నీ వామె నా నెపంబున రేపు సూర్యోదయమున రథాధ్యాసీనగా జేసి యరణ్యమున డించి రమ్ము. పొమ్ము.

(నిష్క్రమించును.)

లక్ష్మ—దైవమా! నన్నేందుకు బుట్టించితివి. అగ్రజుని యాజ్ఞ నను సరింపక తప్పదు.

(నిష్క్రమించును.)

భర—తమ్ముడా! ఇక మనము విచారించిన నేమి లాభమున్నది. విధి వ్రాలును నెవ్వరును దప్పింపఁజాలరు. అరణ్యముల యందున్నను జనకజను నిరంతరము గాపాడుటకు మనము సర్వదేవతలను వేడుకొను చుందము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# కుశలవ పట్టాభిషేకము.

## ద్వితీయాంకము

[అరణ్యము:—సీతయు లక్ష్మణుఁడును - ప్రవేశించుచున్నారు.]

సీత—(లక్ష్మణునిఁ జూచి) లక్ష్మణా!

తే. గీ శుభనిమిత్తంబు లేవియుఁ ♦ జూడఁబడవు
నలుదిశల దుశ్శకునములే ♦ నాకుఁదోఁచు
భావ మెల్లఁ గడుఁ గలఁత ♦ వడియె మఱఁది
కారణంబేమొ దీనికిఁ ♦ గానరాదు.

సౌమిత్రీ! ఇది యేమి! మనము నగరము విడిచినది మొదలు మార్గ మధ్యమందన్నియు దుర్నిమిత్తములే కలుగుచున్నవి. మార్తాండుఁడు నభోమండలంబునఁ దన సంపూర్ణ కిరణంబులను బ్రసరింపఁ జేయుచున్నను నా కన్నులకు జగమంతయు నంధకార బంధురమైన విధము తోఁచుచున్నది. రథధ్వజముపైన గ్రద్దలు పురివిచ్చి యాడుచున్నవి. భూమియంతయు బొంగరమువిధమున దిరుగుచున్నట్లున్నది. (ఇంచుక యూరకుండి) అక్కటా! ఏమిది! మందుకైన నొకశుభశకునము గాని పింపకయున్నదే! దీనివలన నాకేవిధమయిన హానిసంభవించునో యని సంశయముగ నున్నది. (ఆలోచించి) హానియా! నాకుసంభవించునా?

చ. రవికులవర్ధనుండు గుణ ♦ రాజితుఁ డంచిత పుణ్యమూర్తి, రా
ఘవుఁడు సతంబు నాహృదయ ♦ కంజమునందు వసించుచుణ్ సదా

యవి రళరీతి మంగళము ♦ లన్నియు బ్రేమను గూర్చుచుండఁగా
భువినెటు లాపదల్ గలుగ ♦ బోవును నాకుఁ దలంప లక్ష్మణా!

(ఇంచుక యూరకుండి) ఎంతమట్టునకుఁ జూచినను దుశ్శకునములమీఁద దుశ్శకునమే గానిపించుచున్నది. ఓసమస్త దేవతలారా! ఈ మరిన్ని మిత్తములవలన నిరంతరము నన్నుఁ గంటికి ఱెప్పచందంబున గాచి రక్షించుచుండు రవికుల పయః పారావార సుధాకరుండును ఆర్తత్రాణ పరాయణుండును, సకలదైత్య విరాముండును, సర్వజన నయనాభిరాముండును నీలమేఘశ్యాముండును, నా ప్రాణ నాథుండగు శ్రీరామచంద్రునకు, నేవిధమయిన యశుభము గలుగ యుండుగాత. నా మఱందులకును, నామఱఁదండ్రికును, అత్తలకును, తక్కిన బంధువర్గమునకును శుభంబగునుగాత. రాష్ట్రజనులకు సౌఖ్యము గలుగుగాక! (లక్ష్మణునిఁ జూచి) లక్ష్మణా! ఎంత యోపిక వహించినను జిత్తమున ధైర్యము నిలువక యున్నది.

సీ. తపసివేషముఁ దోడఁ ♦ విపినంబులకు నేగు
నాత్మేశు వెనువెంట ♦ నరుగునాడు
ఘోరాటవిని నన్నుఁ ♦ గ్రూరగ విరాధుండు
చంకలో నిఱికించి ♦ చనెడునాడు
హా లక్ష్మణా తమ్మ ♦ డాయుని కడు మాయ
హరిణమౌ మారీచు ♦ డఱచునాడు
లంకలోపలనున్న ♦ శంక యింతయు లేక
యమరారి దుర్భాష ♦ లాడునాడు
తే. గీ. ధైర్యమును నీడి యిట్టి చిం ♦ తను మునింగి
యెఱుఁగ; లక్ష్మణా నేడవి ♦ యేమికత మొ
చిత్తమంతయు నక్కటా! ♦ చేయివెట్టి
కలచుచుండిన రీతినిఁ ♦ గానిపించె.

లక్ష్మణా! మన్మాథుఁడు నాయెడల ననురాగ పూరితమనస్కుఁడై యే కాంతంబున నన్ను విలోకించి "కాంతా! నీయభీష్టమెట్టిది" యని య డుగ, నేను మఱియొండువరం బేదియైనఁ బ్రసాదింపుమనికోరక, మంద భాగ్యురాలనై, భాగీరథీనదీ పరిసరప్రదేశంబులందుండు మునికుటీరం బుల తాపసకన్యల దర్శించి రావలయునని యేలకోరితిని? కోరితినిగాక! మంచిచెడ్డలు దెలియక యిమ్మాన్యుని యిట్టికోరికఁ గోరినదని తలంచియేల నిరాకరింపఁడయ్యెను? అక్కటా! ఇట్లేలవచ్చితిని? (గంగనుజూచి సంతోషముతో) ఆహా! గంగ యెంతనయనపర్వమొనర్చుచున్నది.

తే. గీ. స్నానమాడిన యంతనే ♦ సకలకలుష
రహితులుగఁజేసి జనుల స్వ ♦ ర్గంబుఁ జేర్చు
హరిపదాంభోజసంభవ ♦ యైనగంగఁ
గాంచు మయ్యాదె కన్నుల ♦ కఱవుదీర.

లక్ష్మ—(తనలో) ఇంతవఱకును దుర్నిమిత్తంబులనుగాంచి చింతించు చున్న యీ యమ్మ యింతలోనే గంగాపావనవాహినిఁగాంచి సంతసించుచున్నది.

తే. గీ. వెఱ్ఱితల్లి గంగను జూచి ♦ వేడ్కపడుచు
నుండె నక్కటా ముందురా ♦ నున్నకీడు
నరయఁజాలకయుండె నీ ♦ యలఘుశీల
విపినభూముల యందెట్లు ♦ విడుచువాఁడ.

అయ్యో! శ్రీరామచంద్రుని యాజ్ఞ నీమెకేభంగి వినిపింప గలుగుదును. (విచారించుచున్నాఁడు.)

సీత—లక్ష్మణా.

తే. గీ. గంగయును పేర మూఁడులో ♦ కముల పరమ
పావనంబొనరించు స్ర ♦ వంతిఁగాంచి

సంతసంబొందక యారీతి ♦ స్వాంతమందు
వగపుబొందఁగ నేటికి ♦ వరగుణాఢ్య.

నేను చూచుచున్నాను. రథముపై నడుగుపెట్టినప్పటినుండియు నీవు విచారభావమునే పొందియున్నావు.

మ. అనఘా! సొమ్ములనెల్ల లాగుకొని ఘో ♦ రారణ్యభూమిన్ వసిం
ప నినున్ రాముని నన్ను గైక, వినుమా ♦ పంపించునప్పైన నీ
మనమం దిట్టి విచారమున్ గనవు; నీ ♦ మోమున్ విలోకింప నే
డనుమానంబగుచున్న దేటి కిటు దుః ♦ ఖాంభోధిలోమున్గఁగన్.

మఱిదీ శక్తిధరుండై ప్రళయకాల రుద్రాకృతినిదాల్చి ప్రచండ భండనంబున నుద్దండశౌర్యముచేర్చి నిన్ను దశముఖుఁడు దాకినప్పుడైనను, మాయాయుద్ధవిశారదుండగు మేఘనాథుఁడు నికుంభిలయందుం శినీపైని నిశితవారాచపరంపరలు గప్పినప్పుడైనను నీముఖంబునకాంతి తగ్గలేదు. కాని నేడు నీమొగము మిగుల విన్నబోయియున్నది. ఇంత యధైర్యము వహించుటకుఁ గారణమేమి?

లక్ష్మ—(మాట్లాడకయుండును.)

సీత—సౌమిత్రీ! మాట్లాడవేమి? అన్నగారినివిడిచి వచ్చితినని బెంగ గలిగినదా! అట్లయిన మనము మునికన్యకల సందర్శించి సత్వరముగనే పోవుదము. తాపసాశ్రమములన్నియు నదికావల వైపుననున్నవికాబోలు? భాగీరథిదరించి యావలకుఁబోదమా. (ఎదుటఁజూచి) అదిగో! అక్కడ నావ యున్నట్లున్నది

లక్ష్మ—(తనలో) అక్కటా! పరమేశ్వరా! నాచేత నెట్టికష్ట కార్యము జేయించుచుంటివి. (ప్రకాశముగా) అమ్మా! మనదారిని బోయి గంగ దాటుదము. నీవు తలంచినట్లు తాపసకుటీరములా దెసనే యున్నవి. (రథము కొంచెము నడిపించును.)

సీత—సౌమిత్రీ! ఈమార్గమున దీసికొనిపోవుచుంటివేమి. దారితప్పి చున్నదికాబోలు చూడుము. ఇది యంతయు భయదారణ్య ప్రదేశముగనే యున్నది కాని తాపసాశ్రమభూమి కనుపించుట లేదు.

సీ. భీతావహంబగు ♦ విపినభూములెగాని
మహాకుటీరముల్ ♦ గానఁబడవు
మిగుల భీతినిగొల్పు ♦ మృగసంచయమెగాని
ముని శిష్యవర్గంబు ♦ గనఁగరాదు
కంటకావృతమైన ♦ క్రూరగుహంబులెగాని
దైవార్చనాయోగ్య ♦ తరులు లేవు
భయద భిల్లాంగనా ♦ ప్రకరంబులేగాని
మునికన్యకామోద ♦ మొదవదిచట

తే. గీ. లేవు వేదఘోషంబులు ♦ లేవు హోమ
ధూమకీలలు కనుపులు ♦ దోచవిచట
రారు మునిబాలురు ఫలప ♦ త్రములకొఱకు
దారి పెడదారిగా నిప్డు ♦ మారెనేమొ.

ఈసమీపమున దాపసాశ్రములున్నచో నీప్రదేశమిట్లుండునా ?

లక్ష్మ—హా! పరమేశ్వరా. (ఏడ్చును.)

సీత—లక్ష్మణా! ఏమిది? నీవిచారమంతకంత కధికమగుచున్నదే యెందు కీవిచారము?

చ. ధరణిపునాజ్ఞ మీఱవు క ♦ దా! నొనరింపఁగరానికార్యమీ
ధరణిని నీవొనర్పవు క ♦ దా! రఘురాముని యాజ్ఞలేక యీ
కరణిని నన్నుఁ దోడ్కొనుచుఁ ♦ గానకు రావుకదా! మఱేల, దు
ర్భరమగు శోకమొందెదవు ♦ రమ్యగుణాకర చెప్పుమా వెసన్.

పరసతీమణులన్న మాతృభావంబునఁ, జూచెదవు. సేవమ్ము[illegible]

యుండవు, శరణాగతులను రక్షించుచుందువు. అట్లు నీకుఁ జింతకుఁగారణ మేమి ?

లక్ష్మ—

మ. మణిసౌధంబుల దాసికాజనము శుం ♦ భద్భక్తి సేవింపఁగా
ఘనసౌఖ్యంబుల గాంచుచున్ రఘువర ♦ శ్రీమోహిపై పజ్జన్ ముదం
బునరాజిల్లెడు నిన్ను భీకర మృగం ♦ బుల్ గల్గు నీ భూమికిన్
జననీ! చేర్చి యఘంబుగంటినని నా ♦ స్వాంతంబునన్ గుందెదన్

సీత—లక్ష్మణా! ఇందు నీవు చేసినదేమున్నది.

తే. గీ. తపసికన్యలఁ జూడ మో ♦ దంబుగలిగె
నంచు; ప్రాణేశునానతి ♦ నంది; నిన్ను
వెంటఁ గొనివచ్చితిని గాదె ♦ వెఱ్ఱివగుచు
చింతఁ బొందెద వేటికి ♦ చెప్పుమయ్య.

నీవు రామచంద్రుని యాజ్ఞ లేకుండ నన్నుఁ దీసికొని రాలేదు కదా?

లక్ష్మ—అమ్మా! నే నట్లేల సేయుదును?

సీత—అట్లయిన విచారమేల?

తే. గీ. పోవనున్నది తపసుల ♦ పుణ్యభూమి
వేడి, గైకొనినది రాము ♦ విభునియాజ్ఞ
వెంటనున్నది నీవు; ని ♦ ర్భీతినుండ
కిట్లు మిగుల దుఃఖించెద ♦ వేల మఱది.

లక్ష్మ—తల్లీ! ఏమని చెప్పుదును?

చ. కరుణను బాఱదోలినడు ♦ కాననభూమికి నిన్నువంటి స
త్పరమపతివ్రతామణి న ♦ పా గుణాకర జేర్చినట్టి దు
శ్చరితుఁడఁ బాపచిత్తుఁడను ♦ సాహసుఁడన్ గుటిలుండ నన్నునున్
ధరణిని నీద శాసము న ♦ దగ్ధునిఁ జేయుము నీకు మ్రొక్కెదన్.

చేయరానికార్యముచేయఁ బూనిన నేనీభూమిపైనుండుట లోకములకు హాని.

సీత—లక్ష్మణా! నీవెందులకిట్లు బలుకుచున్నావో యెఱుఁగజాలకయున్నాను.

లక్ష్మ—ని న్నరణ్యమున విడిచిపోవలసివచ్చినది కదాయని విచారించుచున్నాను.

సీత—విడిచిపోవుటయేమి? మరల తీసికొనిపోవలదా?

లక్ష్మ—అట్టిభాగ్యము నేను నోచుకొనలేదు.

సీత—లక్ష్మణా! అట్లుపలుకుచుంటివేమి? ప్రాణేశ్వరుని యాజ్ఞ యిట్లే యున్నదా?

లక్ష్మ—రాజాజ్ఞ యట్లేయున్నది.

సీత—హా! ఎంతమందభాగ్యరాలను. (ఇంచుకయూరకుండి.)

చ. వనమున మున్ గురంగమును ♦ బట్టఁగబోయెడికాలమందు; నీ
జనకజ జూచుచుండవలె ♦ జాగ్రతతోనని, యేగినట్టి య
మ్మనుకులవర్ధనుండె యను ♦ మానము బూనక కానవాళిలో
ననువిడనాడి రమ్మనియె ♦ నా నిను దెల్పుసుమిత్రపుత్రికా.

ఒకవేళ నీవు పరాకున బలుకుచుంటివేమో?

లక్ష్మ—అమ్మా! నేను పరాకునఁ బలుకుచుండుటలేదు. ఇంక నేను సంశయింపనేల? నిన్నుభీకరారణ్యమున విడిచిరమ్మనియె శ్రీరామచంద్రునియాజ్ఞ. అట్లొనర్చుట కీదుష్టచిత్తుఁడగు లక్ష్మణుఁడు సాహసించినాఁడు.

సీత—హా! నేనెంత యభాగ్యరాలను.

తే. గీ. పతియె దైవంబుగానెంచి ♦ వరలుచున్న
నన్ను; బ్రాణేశుడేల వ ♦ నంబులందు

విడిచిరమ్మని యాజ్ఞ వి ♦ న్పించె నీకు
దోష మేమియెునర్చితో ♦ తోచదయ్యె.

లక్ష్మ—జననీ ! ఏమిచెప్పుదును?

మ. ప్రకట ప్రాభవధైర్యయుక్తు లెసఁగన్ ♦ బాహాబలప్రౌఢ జం
కక, ఘోరాటవినుండగా జగములా ♦ కంపింప గొంపోయి, దై
త్యకులాధీశుఁడు లంకలోనిడిన సీ ♦ తా కాంతఁ జేపట్టె గొం
కక రాముండని, నీచులాడ విని నీ ♦ కాంతుండు పల్కెన్ వెసన్.

సీత—హా ! ఎంత దురదృష్టవతిని. ప్రజలు నన్నుఁ గూర్చి యిట్లుశంకించిరిగా! లక్ష్మణా ! ఈ వాక్యములువిని మన్నాథుఁడగు శ్రీరామచంద్రుఁ డేమనిపలికెను.

లక్ష్మ—తల్లీ ! చెప్పుటకు నోరాడకున్నది. (విచారించును.)

సీత—సౌమిత్రీ ! నీవు విచారించెద వేల ? అన్నగారియాజ్ఞకదా. చెప్పుము.

లక్ష్మ—అమ్మా ! జనులాడు నిందావాక్యములకు భీతిల్లి యమ్మహానీయుఁడు భాగీరథీ తీరస్థ మునికన్యకా సందర్శనమను నెపంబున నిన్ను ఘోర కాంతారంబున డించిరమ్మని యాజ్ఞాపించినాఁడు.

సీత—హా ! రామచంద్రా ! (మూర్ఛిల్లురు.)

లక్ష్మ—అగ్రజుని యాజ్ఞ వినియీయమ్మ మూర్ఛిల్లినది. అక్కటా ! నేనేమి సేయుదును.

సీత—(మూర్ఛనుండిలేచి) హా ! రామచంద్రా ! సుగుణసాంద్రా ! నాహృదయము నుపూర్తిగ నెఱింగినవాఁడవయ్యు నన్నిట్టి యిక్కట్లు పాలుజేయదలంచితివా! (లక్ష్మణునిఁజూచి) లక్ష్మణా! మీయగ్రజుఁడు,

మ. అల లంకానగరంబునం దనలుఁ డా ♦ హ్లాదంబుతో వచ్చి యీ
జలజాతాక్షి సుశీల సాధ్వియనుచున్ ♦ సంప్రీతి వాక్రుచ్చు ప
ల్కుల నాలించియు; నేడు నీచులగు లో ♦ కుల్ పల్కు వాక్యాళిపై
యిల నాకిట్టి దురంతకష్టమును దా ♦ నేఁ గూర్పఁగా జెల్లునే.

మ. పదునాల్గేఁడులు కాననస్థలిని భూ ♦ పాలుండు నీవున్ ననున్
ముదమొప్పంగ నమార్చి శల్ గని; పురం ♦ బున్ నేటికిం జేర్చి, నె
మ్మదియాసంగతు లెల్లనున్ మఱచి యి♦మ్మాడ్కిన్ జనుల్ పల్కుప్ర
ల్లదముల్ వించును నిండుగర్భిణిని నీ ♦ లా నన్నుఁ గావింతురే.

రాజధర్మము లిట్లేయుండును కాబోలు. (ఇంచుక యూరకుండి) మిమ్ము నిందింపవలసిన పనియేమున్నది. నా పురాకృత కర్మఫల మీ తెఱంగున నున్నది.

ఉ. ఇంతకు రామభూపతి య ♦ హీనగుణాఢ్యుఁడు లోకనిందకై
కాంతను నన్నువీడి త్రిజ ♦ గంబులయందునఁ బ్రాకుచున్న భా
స్వంతకుల ప్రసిద్ధికిని ♦ భంగము జేకురకుండ జేసె నా
కంతియెచాలు, నీవు నగ ♦ పందిన లాభము లేదు లక్ష్మణా.

కాని నీవుమాత్రము నా నాథునియాజ్ఞ యిట్లున్నదని నగరమునందే చెప్పయుంటివేని, నేనంతయు సంతసించియుందును. ఏమనిన—

సీ. కడసారి చూపంచు ♦ గనులార రఘురాము
దిలకింపకుందునే ♦ లలిత తేజ
తుదిసారి మ్రొక్కటం ♦ చెదనెంచి పతిపదం
బుల మ్రొక్కకుందునే ♦ పుణ్యమూర్తి
తుదికౌగిలియటంచు ♦ ముదముమీఱగ జేరి
కౌగలింపనె రాము ♦ శ్రీగుణాఢ్య
పలుకుల కీనాడె ♦ పొలిమేరయని మన
సార భాషింపనే ♦ సచ్చరిత్ర

తే. గీ. మరలఁ బతిజూచు భాగ్యంబు ♦ మహితలమున
గల్గునో గల్గదో నాకు ♦ దెలియరాదు
మోసపోతిని మఱి యింత ♦ మోసపోతి
గర్భ నిర్భాగ్యురాలను ♦ గాదె మఱది.

నామోహముచేత నిట్లంటిగాని నీవొనర్చిన దోషమేమియున్నది. నిగ్రహానుగ్రహ సమర్థుండును, సాకేతనగర సామ్రాజ్య లక్ష్మీధురంధరుండును నగు మీయగ్రజుని యాజ్ఞ కాదనువారెవ్వరు. పితృసముండగు నమ్మహనీయుని యాజ్ఞ నెఱవేర్చి నీ భక్తిఁ బ్రకటించితివి.

లక్ష్మ—తల్లీ! నిన్నుఁ జూచిన నాకు దుఃఖ మధికమగుచున్నది. నేఁ జేయదగిన కార్యమొం కనిపించుటలేదు. అన్నగారియాజ్ఞ ననుసరించి యిల్లు దోడ్కొనివచ్చితిని.

తే. గీ తన పురాకృతకర్మంబు ♦ ననుసరించి
జనుల కష్టసుఖంబుల ♦ గనుచునుంద్రు
బ్రహ్మవ్రాలును దప్పింప ♦ వశమె యేరి
కైన నీ వెఱుగని ధర్మ ♦ మవని గలదె.

సీత—లక్ష్మణా! నీవు చెప్పినమాట నిశ్చయమే. ఇదియంతయు నా పురాకృతకర్మ పరిపాకమే. కాని,

శా. శ్రీసంధానములై మహత్తర జగ ♦ జ్జేగీయమానంబులై
దాస శ్రేణి కభీష్టదాయకములై ♦ దైత్యౌఘ విపాశంబులై
నాసింబొల్పెడు రాము పాదయుగ సే ♦ వన్ బాసినా నంచు నే
గాసిం బొందెద గాని కోరుకునె సౌ ♦ ఖ్యంబొందు చిత్తంబునన్.

నేను నగరంబు విడిచితినని బెంగలేదు. సౌఖ్యభోగములకు దూరనైతినని చింతింపను. శ్రీరామచంద్ర పదసేవా దూరనైతినిగదా యని మాత్రము చింతించెదను. ఇట్టి దుర్దశ ఘటిల్లునని నేను కలనైన దలంపలేదు. మొన్న మొన్ననే యరణ్యంబులందు బెడిదంపు టిడుముల బడివచ్చిన

సంగతిని మఱచి, మరల మునికన్యకలను జూచివచ్చెదనని శ్రీరాము నేల కోరితిని? ఇాతకును నాగీత యిట్లుండగా నాకట్టి కోరిక యేల పుట్టక యుండును? ఒకవేళ నేనిట్టి కోరకపోయినను లోకాపవాద బాపు కొని యశము నిలుపుకొనఁదలచిన నానాథుఁడు నన్ను వనంబులకుఁ బంపకయుండునా? ఇదియంతయు వెఱ్ఱిభ్రాంతి.

లక్ష్మ—తల్లీ! జనకరాజపుత్రీ!

చ. నిను విడనాడిపోవుటకు ♦ నేరకయున్నది నామనంబు పో
వని యెడ రాగ్రహించు రఘు ♦ వర్యు డనుజ్ఞను దీర్పకున్న ని
వ్వనముల నెట్లు నొంటరిగ ♦ స్వాంతమునన్ భయమందకుండ నో
జననిరో యుండువో కడు వి ♦ చారముకల్గెడు నేమిసేయుదున్.

నిన్ను భీకరాటవిని విడిచి సత్వరముగ రమ్మని యగ్రజుఁ డాజ్ఞయిచ్చి నాడు. నేను పోవకతప్పదు. తల్లీ! ఆజ్ఞ యిచ్చెదవా?

సీత—

మ. వనమందెన్నియొ కష్టముల్ పడుచు మ♦త్ప్రాణేశ్వరున్ నన్నునుర్
ఘనభక్తిఁ భజియించుచుండి యట వే♦డ్కన్ వన్యముల్ దెచ్చినూ
కును నర్పించుచు బ్రీతిసల్పితివి నీ ♦ కుంజెల్లె దత్కార్య మో
యనఘా! యిప్పుడు నన్ను వీడుదువె యా♦హా! దిక్కునాకేమికన్.

లక్ష్మ—

మ. జననీ కన్నుల నీరుగారగను నీ ♦ స్వాంతంబునన్ దుఃఖ మొం
దిన నే లాభముబొందెదీవు వినుమ ♦ ర్ధిన్ నిన్ను నోదార్ప జా
లిన చుట్టంబులు చేర రా రెవరుఁ ద ♦ ల్లీ! కానలో గావునన్
మనమందున్ రఘురాము పాదయుగమున్ ♦ ధ్యానింపుమా యొప్పుగన్.

అదియే నీయాపదవాపి శుభంబుల గూర్పగలదు. ఇంక నా కనుజ్ఞనిమ్ము. (ఇంచుక యూరకుండి) అమ్మా! నిన్ను విడిచిపోవుటకు నాకు గాళ్ళాడకయున్నవి. హా! పరమేశ్వరా! నే నేమిసేయుదును.

తే. గీ. నిండుచూలాలు సాధ్వి యీ ♦ నెలతె నెట్లు
భీతిగలిగించు కానలో ♦ విడిచిపోను
కటకటా సాధ్వి కీరితి ♦ గడునిడుమల
గలుగ జేసినాడవు గదా ♦ కఠినమతిని.

అమ్మా! ఈకష్టచిత్తుం డెట్టికార్యమును జేయుచున్నాడు.

సీత—

చ. వనటనుగూడకయ్యె పలు ♦ భంగుల నీవిధి నాకునై; మనం
బున దృజియింపు పేర్మి; రఘు ♦ పుంగవు డానతియిచ్చినట్లుగా
జనుము పురంబు జేరగను ♦ సత్వరగా! యికనాకు నివ్వనిన్
వనజభవుండు నెన్నుదుట ♦ వ్రాసిన యట్టులగున్ సుమిత్రిజా.

వత్సా! కడుదడవైనది. ఎంతవిచారించిన నేమి ప్రయోజనమున్నది?

లక్ష్మ—హా! మాతా! ఆనాడు ఘోరారణ్యమున మాయాకురంగమైన మారీచుని యెలుంగువిని నన్నుం బొమ్మన్నంతనే పోవక యుండ, నీవు నిష్ఠురవాక్యములాడ, నీకుం గీడుగలుగునని యైన తలంపక నట్టడవిని నిన్ను విడిచివెళ్ళితిని. అక్కటా! ఇప్పుడు విడిచి యెట్లుపోవుదును. నాకేమిగతి.

సీత—లక్ష్మణా? వగచెద వెందులకు!

తే గీ. పూర్వజన్మంబు నందెట్టి ♦ పుణ్యులైన
దంపతులబాపి యుంటినో ♦ తత్ఫలంబు
కట్టి కుడుపక విడచునా ♦ కంజభవుని
వ్రాతతప్పునా మది విచా ♦ రంబదేల.

నాయనా పోయిరమ్ము.

లక్ష్మ—తల్లీ!

సీ. ఉద్యానవనములలో ♦ నుండజాలని నీవు
భీకరాటవి నెట్లు ♦ వేగగలవు

సాధంబు లెక్కఁగ ♦ జడియు నీ వేమాడ్కి
　　కఠినరానేల నై ♦ కఁగఁగలవు
చిలుకపల్కులకెంతొ ♦ యులుకుచుండెడి నీవు
　　వనమృగారవమెట్లు ♦ వినఁగ గలవు
వెన్నెలకాకకు ♦ వెఱచుచుండెడి నీవు
　　చండభానుని నెట్లు ♦ సైపఁగలవు
తే. గీ. వరమనోహరుసేవ నే ♦ మఱచియుండ
　　నట్టి నీ వెట్లు పతిబాసి ♦ యడవులందు
　　కష్టమందుచు గాలంబు ♦ గడపగలవో
　　భవ్యగుణగాత్రి జనక భూ ♦ పాలపుత్రి!

సీత—సౌమిత్రి! ఇక నాకు రక్షకుఁ డాపరమాత్ముఁడే.

మ. నిరతంబున్ నను బ్రాణతుల్యగను హృ ♦ న్నీరేజమందుంచి సొం
పరయన్ గాచు రఘూద్వహున్ మరల ను ♦ ద్యత్ప్రీతి నీక్షించు భా
గ్యరమన్ నోచకయుంటినేని యిదె గం ♦ గాదేవి కర్పించి నే
దొరగన్ జూతును జీవసంతతిని నా ♦ థున్ వీడి జీవింతునే.

లక్ష్మ—హరి హరీ ఎంతమాట పలికితివి.

మ. జననీ! రాముఁడు నిన్ను పీడెనని నీ ♦ స్వాంతంబునందెంచి నీ
ఘనజీవంబుల వీడబోకుము; జగ ♦ త్కల్యాణ తేజుండు రా
మునిపాదాబ్జకులక్ స్మరించుచు దినం ♦ బుల్ వెళ్ళదీయంగ నె
మ్మనమందెంచుము కళ్ళుమూసికొని నా♦మాటల్ చెవిం జేర్చుచున్.

దుర్భర శోకంబున బలవన్మరణము మాత్రి మందవలదు.

సీత—లక్ష్మణా! అదిమాత్రము మనచేతిలో నున్నదా! బ్రహ్మ
　　యిచ్చిన యాయుర్దాయము తీరవలయునుగదా! ఇంతకును నా
　　వ్రాత యెట్లున్న నట్లగును. నీవు పోయిరమ్ము.

లక్ష్మ—హా! జననీ! జనక రాజఋషికి పావనయజ్ఞవేదికా తలంబున లభించిన తనూజవు. రవికులచంద్రుఁడగు దశరథ నృపాలుని పెద్దకోడలవు. సకలభువన శాసనదక్షుఁడగు శ్రీరామచంద్రుని దేవేరివి. ఆజ్ఞయిచ్చినంతనే పదునాల్గు లోకము లొక్కమూలకుఁ దేఁజాలిన శౌర్యధనులును, సత్యసంధులును, భవదాజ్ఞా పరిపాలకులును నగు ముగ్గురు మఱఁదులు కలదానవు. అత్తలు మఱదండ్రు మొదలగు బంధుజనములచే విరాజిల్లుచున్నదానవు. అట్టి నీవు అక్కటా! నేఁడీఘోరారణ్యమున దిక్కుమాలిన దానవైతివికదా!

సీత—లక్ష్మణా!

చ. నిరతము త్రోడు నీడవలె ♦ నీవు చరించుట జేసి, నన్ను నీ
-కరణిని బాసిపోవగను ♦ గాలిడఁజాలక జింతఁబొందె దీ
వరయవదేమి కష్ట సము ♦ యంబులయందునె ధైర్యలక్ష్మినిన్
సరగున బూననొప్పునను ♦ సజ్జనవాక్యము సద్గుణోదధీ.

సహజధైర్య చిత్తుఁడవగు నీవే విచారించిన నాబోటికాంతలంగూర్చి యేమిచెప్పవలయును. నీవుగాని నేనుగాని యెంతవగచినను బ్రయోజనము లేదు. ఇంక నీవరిగి నీలమేఘశ్యాముండును, వందితసుత్రాముండును, భక్తజనహృత్కుముదినీ సోముండును, సకలదైత్యకుల విరాముండును నగు శ్రీరామమూర్తికి నామారుగ కరపంకజంబుల మొగిడ్చి నమస్కరించి యిట్లు విన్నవింపుము.

చ. దనుజుఁడు గొంచుబోవ నన్నుఁ ♦ దప్పక నీవరుదెంచి వానినిన్
ఘనరణమందు దున్మిననుఁ ♦ గైకొనిపోవుదువంచు నెంచి లం
కను యుసురుల్ భరించితిని ♦ కాయమునం దిపు డీవె యక్కటా
నను విడనాడినాడ విక ♦ నా తను వెట్టులు నిల్చు ధాత్రిపై.

మఱియు నమ్మహాత్ముఁడే జన్మజన్మములకు నాకు బతికావలయునని

కోరుచుండుమనని పలుకుము. మా యత్తలు ముగ్గురకును నావందనముల దెలుపుచు విశేషించి కౌసల్యామహాదేవితో మునికన్యకాసందర్శన మిప్పుడు వలదని నీవు చెప్పిన పలుకులు వినక వచ్చినందుకు దత్ఫలం బనుభవించితి ననియు, శ్రీరామచంద్రుఁడు నన్నిట్లు జేసెనని యామహా నీయునిపై నాగ్రహింపవలదనియుఁ జెప్పుము. మఱవండ్రకు నా దీవన లెఱిగింపుము. భరతశత్రుఘ్నుల నడిగితినని తెలుపుము.

లక్ష్మ—తల్లీ ! నేను మహాదుఃఖసాగరమున మునిఁగియుంటిని. ప్రపంచ మంతయు నాకంధకార బంధురమై యున్నది.

తే. గీ. ధరఁ బ్రసిద్ధివహించిన ♦ తరణికులము
నేటితో దీరుకాబోలు ♦ నిక్కముగను
గాకయుండిన గాంతువే ♦ యిడుమలిట్లు
నీవు కాలమహిమకు నే ♦ నేమివగతు.

సీత—నాయనా !

తే. గీ. సీతతో భానువంశంబు ♦ క్షితితలమున
నస్తమించు ననుచు ఖేద ♦ మొందదగదు నె
వర్ధిలుంగాక వేయేండ్లు ♦ వత్స ! మీ కు
లంబు నారవిశశితార ♦ కంబుగాను.

మీవంశ మభివృద్ధి బొందవలయును. నేనెచ్చటనున్నను మీ శ్రేయమును గోరుచు సంతసింపవలయును. ఇదియే నాయభిలాష. తండ్రి ! అరణ్య వాసము నా కాజన్మాంతము నుండునని బ్రహ్మ నా నొసట వ్రాసినాడు. దీని కెవ్వ రేమి సేయుదురు. కర్మము ననుసరించి ప్రతివిషయము జరుగు చుండును. దాని నెవ్వరును దప్పింపఁజాలరు.

చం. జనములు పల్కసందిలకుఁ ♦ జాలభయంబునుఁ బొంది రాముఁ డీ
వసితఁ బరిత్యజించెఁ దన ♦ భవ్యయశంబును నిల్పఁగోరి; నె

మ్మనమున దీని కేను యేను ♦ మాత్రము జింతిలబోనుగాని యీ
మనుకుల వృద్ధిఁగోరుదు సు ♦ మా! వనమందుననున్న లక్ష్మణా.
లోకాపవాదయు, శ్రీరాముని యాజ్ఞయు నీవు చిత్తమునఁ దలంచితి వేని
యింతవిచారమును బొందవు.

లక్ష్మ—అమ్మా! తక్కిన దానికేమిగాని రామాజ్ఞమాత్ర మనుల్లం
ఘ్యనీయము. ఇక నేను పురమునకు బోవకతప్పదు. నా
విన్నపము మాత్రము వినుము.

తే. గీ. అతివలకునెల్ల దలకట్టు ♦ వౌదు వీవు
గాన నీకు నీతులుజెప్పఁ ♦ గలనె నేను
కాని తల్లితో తుల్యవై ♦ గ్రాలుకతన
జెప్పుచున్నాడ క్షమియింపు ♦ క్షితికుమారి.

చ. పతియిటు వీడెగా యనుచు ♦ భావమునందున గుందికుంది యే
గతినయినన్ వనంబునను ♦ గాయము బాయగ జూడబోకు మా
గతినొనరించినన్ వినుము ♦ కల్గును పాపము భ్రూణహత్యచే
మతినిదియెంచి దేహమున ♦ మానిని దాల్పుము బ్రాణ మెట్టులో.

ఇంతకన్న నేను నీకుఁ జెప్పవలసిన దేమియు లేదు.

సీత—లక్ష్మణా! నా కీభయమును గూడ గల్పించిపోవుచుంటివా?

లక్ష్మ—(తనలో)

సీ. ఇది ధర్మము నధర్మ ♦ మిదియంచుజాటెడు
భవ్య బృందారక ♦ ప్రముఖులార
కర్మసాక్షులగుచు ♦ గగనప్రచారులై
చాలవెలుగు సూర్య ♦ చంద్రులార
మాటమాత్రంబున ♦ మహితలోకము లెల్ల.
నియమింపఁజాలు యమ ♦ నింద్రులార

భువనపాలకులొాచుఁ ♦ బొలుపొంది దీనుల
బ్రోవఁగాఁ జూచు త్రి ♦ మూర్తులార

తే. గీ. కాలవశమున రామభూ ♦ కాంతు బాసి
విపినములలోన నున్న యీ ♦ పృథ్వీసుతను
గావరే సంతతంబునుఁ ♦ గరుణఁబూని
మీకునంజలిఁ జేతు న ♦ మేయభక్తి.

సీ. భూదేవిపుత్త్రియై ♦ పొలుపొంది జనకుని
చేతులఁ బెరిగిన ♦ చిగురుబోడి
మా, రాముదేవియై ♦ మామయౌ దశరథు
మన్ననగాంచిన ♦ మగువమిన్న
నిరతంబు గురుసేవ ♦ బఱికించు సుగుణాఢ్య
మఱుకుల సుతులుగా ♦ మనుచు సాధ్వి
తలిరుబోండ్లకునెల్ల ♦ దలకట్టు యగ్నిహో
త్త్రునిమెప్పుబొందిన ♦ వనజనేత్రి

తే. గీ. మునిసతులు ననసూయాది ♦ పుణ్యసాధ్వీ
మణులచే వినుతినిగన్న ♦ మహితచరిత
సీత శ్రీరాముభార్య ఈ ♦ చెలువబ్రోచు
భారమంతయు మీయదే ♦ భవ్యులార.

(సీతఁజూచి) తల్లీ! ఇఁక పోయివచ్చెదను. శ్రీరామనామ స్మరణమే నిన్నురక్షించుగాక. (నిష్క్రమించును.)

సీత—అయ్యో! లక్ష్మణుండరిగినాఁడు.

ఉ. ఇవ్విపినంబులోన నిఁక ♦ నెక్కడి కేగెదుదాన నాకు ది
కెవ్వరు వత్తురే యొడకు ♦ నేడ్వకుమంచును నూరడింపఁగా

నెవ్వరి వేడుకొందు వగ ♦ నెవ్వరు జూతురు దిక్కులేక నే
నివ్విధినుండఁగావలసె ♦ నెందఱో బంధులు గల్గియుండియున్.

ఈ మహారణ్యమున నన్నారడించు వారెవ్వరు? నేనే యేడ్వవలయును. నేనే యూరడించుకొనవలయును. హా! పరమేశ్వరా! దీన త్రాణ పరాయణా!

తే. గీ. భానుఁడాకాశ వీధినిఁ ♦ బ్రబలుచుండె
జెమ్మటలు గ్రమ్ముచుండె దే ♦ హమ్మునందు
నడుగు నిడఁజాలకుంటిని ♦ నడవియందు
దాసురాలిని బ్రోవవే ♦ దయనుబూని.

చేసుకొన్న మగఁడే కారుణ్యమున బరిత్యజించి నట్టడవిని డింప నింక బర మేశ్వరుఁడా దయఁజూచువాడు. ఏమినా వెఱ్ఱితనము. (రామునుద్దేశించి) నాథా! నీ నామస్మరణమైన నాపరితాపమును గొంత పోఁగొట్టుఁగాక!

శా. రామా! సూర్యకులాబ్ధిసోమ! ముఖ జ ♦ ద్రాకాసుధాంశా గుణ
స్తోమా! సామజరాజ హృత్కుముదినీ ♦ సోమా! విరాజద్ఘన
శ్యామా! సంగరభీమ! భక్తజనయో ♦ గక్షేమ! శ్రీరామ నీ
భామన్ నన్నుఁ ద్వదీయపాదయుగ సే ♦ వాసక్త రక్షింపుమా.

నన్ను పరిత్యజించిన శ్రీరామునకు దయవచ్చునా!

తే. గీ. విభునిచే నీవిధంబున ♦ విడువఁబడిన
నేను ప్రాణంబులను దాల్చి ♦ యేల బ్రదుక
వలయు; వనులందు గష్టముల్ ♦ బడుచు నకట
కాయమునువీడి సౌఖ్యంబుఁ ♦ గందుఁగాక.

ఇదిగో రంగ దుత్తుంగ తరంగ యగు గంగాభవాని. నే నిందుబడి జీవం బుల విడిచెదఁగాక. (గంగను సమీపించి) పరమపావనీ! గంగాభవానీ! పతిచే విడువబడిన నాబ్రదుకు నిరర్థకము. కావున గరుణించి నన్ను నీలోఁ గలుపుకొమ్ము. (పడబోయి) అయ్యో! మఱచితిని.

తే. గీ. చావవలదు చచ్చితివేని ♦ చానభ్రూణ
హత్యదోషంబు నీమెడ ♦ కంటుకొను న
టంచు వచించి సౌమిత్రి ♦ యరిగియుండె
నింక నేరీతి ప్రాణంబు ♦ లిపుడు విడతు.

ఇంక నేనిప్పుడేమి సేయుదును. నిజమనోహరుని జూచుటకు సాకేతం బునకే పోవుదునా ! ఏమి ! ఈ వెఱ్ఱితనము. లోకాపవాదకు భయమంది పురంబునుండి వెడల నడిపిన నా నాథునికడ కతని యనుమతి లేనిదే యెట్లు పోవుదును ? ఇక బుట్టినింటికిఁ బోవుదునా! (అలోచించి) ఏమి ! నా వెఱ్ఱితనము !

ఉ. పుట్టినయింటివారు పరి ♦ పూర్ణ ముదంబున వచ్చి యెట్టులో
పట్టినిగొంచు బోవు టది ♦ భావ్యముగాని, నిజేశు చేత నీ
పట్టున పీడగాబడిన ♦ భామ తనంతట తానె యేగినన్
గట్టిగ నవ్వరేజనులు ♦ కాగలకార్యము దోచ దక్కటా.

తన నింద బాపుకొనుటకు సీత యేమైననుసరే యని నాథుండు నన్ను బరిత్యజించినాడు. లక్ష్మణుఁడు భ్రూణహత్య దోషము సంభవించును గాన బ్రాణములు విడువ వలదని చెప్పినాడు. అయ్యో ! ఈ పొట్టఁ జేతఁబుచ్చుకొని యెవ్వరిగృహంబున కేగుదును. ఈ ఘోరారణ్యమున నా కేమిదారి! ఎవ్వరింటికి బోయిన నెవ్వ రాదరింతురు. అత్తవారిల్లును పుట్టిల్లును గాక సువతి మఱియొక గృహంబున కరుగఁ జెల్లునే ! హా ! రామచంద్రా ! నన్ను దిక్కుమాలినదానిగఁ జేసితివా ? ప్రాణేశ్వరా! నీ విమల నామోచ్చారణమే నన్నీ ఘోర విపత్పయోరాసి దాటించు గాక ! రామా రామా !

[వాల్మీకి - ప్రవేశించును.]

వాల్మీ—ఇచ్చట రామనామస్మరణ వినవచ్చుచున్నదే. (ఎదుటఁ జూచి) ఇదిగో ! ఇచ్చట నొక నారీమణి దీనయై యున్నది.

పాప మీమె దీనావస్థకుఁ గారణమగుసెదగాక ! (సీతను సమీపించి.)

ఉ. ఎవ్వరిదాసవీవు జల ♦ జేక్షణ నీయభిధానమేది నీ
వెవ్వనికిన్ జనించితివి ♦ ఎందుల నీగతిశోకమూని నీ
వివ్వన భూమిఁ జొచ్చితివి ♦ యింతయుదాచక నీచరిత్రమో
జవ్వని ! తెల్పుమా వినెద ♦ సంయమిపుంగను భయం బికేటికిన్.
అమ్మా ! నేను వాల్మీకి యను మునీంద్రుఁడను.

సీత—సంయమీశ్వరా ! ఇంతకు మున్ను నేను దర్శించి యుండక పోయినను మీయతుల తపః ప్రభావమును గూర్చి వినియుంటిని. మహానుభావా ! మిథిలాపురాధీశ్వరుఁడగు జనక రాజ ఋషి కూతురను. దశరథుని పెద్దకోడలను. సూర్యవంశ క్షీర పాథోరాసి పూర్ణశుపాకరుండును, సమస్త సద్గుణస్తోముండును, దైత్యకుల విరాముండును నగు శ్రీరాముని భార్యను. లంకా పురమున రావణునిచే నొక సంవత్సరము లంకయందుంచబడిన సీతను శ్రీరాముఁ డేలుకొను చున్నాఁడని నీచులాడిన మాట లను బాటించి మత్ప్రాణేశ్వరుఁడు లోకాపవాద బాపుకొను టకై నాకీ యరణ్యవాసము గల్పించినాఁడు. ఇదియె నా యుదంతము. (చింతించును)

వాల్మీ—తల్లీ ! చింతింపవలదు.

ఉ. చింతిలకమ్మ దుఃఖమున ♦ జీవవిభుం డిటుఁజేసెనంచు ఈ
ప్రాంతము జేరి తంచు బలు ♦ వంతను గాంచకుమమ్మ; భారతీ
కాంతుడుతీర్చి నెన్నుదుట ♦ గాంతరొ వ్రాసిన వ్రాతదాటఁగా
నెంతటివారికైనఁ దర ♦ మే ! యిది నీవు నెఱుంగకున్నంటివే.
తే. గీ. చాన ! నీతండ్రికినిఁ గూర్చు ♦ సఖుఁడ నేను
జనకుగా నన్ను భావించి ♦ సంతసమున

రమ్ము నాకుటీరమ్ము జే ♦ రంగ నుండు
గాక యంను దాటుపటకుఁ ♦ గష్టసమితి.

నీవు నీ జనకుని గృహమున నెట్లుంట్లుండువో యట్లే నా యశ్రమంబున నుండవచ్చును. మునికన్యకలు నిరంతరము నీయోగ క్షేమములు జూచుచు నిన్నుఁ గనిపెట్టుకొని యుందురు. నీకు త్వరలో శుభములు కలుగును.

సీత—మహాత్మా! ఈ నిర్భాగ్యురాలికి శుభంబులు గూడనా?

తే. గీ. భయదవనములే నీకు ని ♦ వాసమంచు
బ్రహ్మ నామోమునందున ♦ వ్రాసినాడు
పతి పరిత్యజించెను నికే ♦ భంగి నన్ను
మంగళంబులు చేరును ♦ మౌనివర్య.

వాల్మీ—తల్లీ! చీకటి కొన్నిరోజులు. వెన్నెల కొన్నిరోజులు. కష్టము లెప్పుడును గాపురముండవు. నీ పతికే యనుగ్రహము వచ్చి నిన్ను బిలిపించుకొనును. అదియుగాక,

తే. గీ. రవికుల ప్రదీపులగు పు ♦ త్రకులు నీకు
నిరువు రుదయింప నుండిరి ♦ ధరణిజాత
వారివలఁన నీమానస ♦ వ్యధను బాసి
సౌఖ్యమును గాంచఁగలవు సం ♦ శయము లేదు.

ఇంక నా యాశ్రమమునకుఁ బోవుదము రమ్ము.

సీత—మౌనీంద్రా! ఇట్టి కష్టసమయమున నీవు నాకు దండ్రివైతివి. మీ ఋణము నేను తీర్పఁజాలను.

వాల్మీ—అమ్మా! రమ్ము. ఇదే మార్గము.

(నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# కుశలవపట్టాభిషేకము.

## తృతీయాంకము.



[సభాభవనము:—రాముఁడు - భరతుఁడు - శత్రుఘ్నుఁడు. ప్రవేశించుచున్నారు.]

రాము—(సీతనుద్దేశించి.)

మ. మును లంకాపురమందు నామసుగుణం ♦ బుల్ దా బరీక్షించియున్
నను నీరీతిని గానకంపె ననుచున్ ♦ భావించి, చింతించి, యే
మని నన్ దూరితివో; భయంకర మహా ♦ రణ్య ప్రదేశంబునం
దున నెట్లుంటివొ నేను నీయెడఁ గిరా ♦ తుండన్ గదా జానకీ.

చ. వనితరో కాననంబుల ని ♦ వాసము తీఱెను నింక సౌఖ్యమున్
గనెదవుగాక యంచును మ ♦ నంబున నెంచి ముదంబునంద, నే
మని మదిఁ జింతబొందుదును ♦ నచ్చతురానను వ్రాతకుం గటా
వనముల వాసమే మఱలఁ ♦ బ్రాప్తిలె నీ కది యేమి పాపమో.

హా! తపస్వీమణీ! ఇది యంతయు నామూలమునఁ గదా నీకుఁ గలుగుచున్నది.

చ. జనకజ "సాధ్వి సాధ్వి" యని ♦ సన్మునులున్ సురలున్ ముదంబునందఁగా
ననలుఁడు లంకయందు. నిను ♦ నాడినపల్కుల నమ్మి; నేడు దు
ర్జనుఁడొక డిట్టులాడగను ♦ సైపఁగజాలక నింద ; నిన్నునున్
వనమున కంపినాడ విధి ♦ వ్రాతకు. నేమని చింతబొందెదన్.

హా! జనకరాజ కుమారీ! నన్నుఁ బాసితివా?

తే. గీ. సంతతము తోడునీడగాఁ ♦ సంచరించి
నట్టి, సాధ్విని నిన్నెడ ♦ నాడినాడ
నింక నెవ్వరిఁ జేరుదు ♦ నెవరు నాదు
దుఃఖమార్పఁగ వత్తురు ♦ తోయజాక్షి.

భర—సర్వము దెలిసిన నీ వీరీతిని శోకించిన, నీకు జెప్పఁగలుగు వారెవ్వరు?

తే. గీ. విష్ణుఁడవు నీవు; శ్రీరమ ♦ వెలది సీత
యొకరి నొకరెడబాయుచు ♦ నొప్పుటేమి
కారణాంతరంబున నిట్లు ♦ గలిగెఁగాని
చింతఁ బొందెద వేటికిఁ ♦ జిత్తమందు.

శత్రు—అన్నయ్యా!

తే. గీ. లీలఁ బదునాల్గుజగముల ♦ నేలుచుండి
యఖిల జీవసంతతి హృద ♦ యంబులందు
వెలుఁగుచుండెడు నయ్యాది ♦ వేల్పువు
సీతయిందిర; యట్టిచోఁ ♦ జింత యేల.

నిరంతరము నీకడ నీడవలెనుండు ననపాయిని యగు సీత యెక్కడి కరుగును. భగవంతుఁడ వగు నీవే యిట్లు విచారించిన, మాకేమిదిక్కు.

లక్ష్మ—(ప్రవేశించి) భరతశత్రుఘ్నులచేఁ బరివేష్ఠింపఁబడి యగ్రజు డిచ్చట నున్నాడు. సీతా వియోగమున దుఃఖించుచున్న విధ మీయన ముఖమే దెలుపుచున్నది. అక్కటా!

చ. జనకకుమారి నావిధిని ♦ సాహసమూనుచు నీవు చెప్పఁగా
వనముల డించితంచు రఘు ♦ నాథున కెట్టులు చెప్పువాఁడ జె
ప్పిన విని ఘోరదుఃఖమునఁ ♦ బృథ్వినిఁగూలఁడె; యేమిసేతు, నె
మ్మనమున నేవిధంబున స ♦ మంచిత ధైర్యము బాదుకొల్పుదుః.

ఇప్పుడు విచారించినందు వలనఁ బ్రయోజన మేమియున్నది. నిర్దయగా త్ముఁడనై పూత చరిత్రయగు సీతామహాదేవిని కిరాతుని చందంబున నరణ్యమున విడిచి వచ్చిన నేను ఆవార్త చెప్పుట కేలసంశయించ వలెను.

తే. గీ. పరమపావన చరితయా ♦ ధరణిసుతను
గానలో డించి; నట్టిఁ ల ♦ త్ముఁడు నీకు
బ్రిణుతు లర్పించుచున్నాడు ♦ భక్తితోడ
గూ్రరుఁ డంచు దలపక గై ♦ కొమ్ము రామ.

(శ్రీ)రా—తమ్ముఁడా! సీతయెడల నీవు చేసిన దోస మేమియున్నది. లోకవినుతిగన్న యాసాధ్వికి నేనే సంకటములు గల్పించితిని. సీతపాలిటికి నేను ప్రాణేశ్వరుఁడను గాను. ప్రాణములఁ దీయు కిరాతుఁడను. (సీతనుద్దేశించి) హా! సీతా! సద్గుణవార్తా!

సీ. ఘోరశార్దూలాది ♦ క్రూరమృగారవం
బుల కెట్లు భీతినిఁ ♦ బొందినావొ
కంటకావృతమైన ♦ కానన శ్రేణిలో
న వగచు చేరీతి ♦ నడిచినావొ
వర్షాతపంబుల ♦ బడలుచు నాకలి
దప్పుల కేభంగిఁ ♦ దాళినావొ
కాంతుఁ డేరీతి ♦ గావించె నంచును
డెందమందున నెట్లు ♦ కుందినావొ

తే. గీ. అకట! నిర్దయంబూని ని ♦ న్నడవి కంపి
పాపినై యిట్లు పురినుండి ♦ భవ్యసుఖము
లందుచున్నాడ; గతినుండ ♦ నగుగు నేను
భవ్యగుణగాత్రి జనక భూ ♦ పాలపుత్రి.

సీ. కడుభయంకరమైన ♦ కాననభూములే
విహరించు తోఁటలా ♦ విద్రుమోష్ఠి
కూతవిన్న భయంబు ♦ గొలిపెడి మృగములే
పనికత్తెలా నీకుఁ ♦ బద్మగంధి
వన్యఫలంబులే ♦ పరమమోదముతోడ
భుజియించు నన్నమా ♦ పొలతిమిన్న
ప్రేతభూములయందు ♦ విహరించు జంబుకా
రవము సంగీతమా ♦ రాజవదన

తే. గీ. అకట యెట్టికష్టంబు ♦ లందుచుంటి
విలను శ్రీరామచంద్రుని ♦ వెలదివయ్యు
బ్రహ్మవ్రాతకు నేమని ♦ వగుచువాడ
సుఖము లనుమాట నెఱుఁగవు ♦ సుదతిమిన్న.

అక్కటా! తలోదరీ! ఈ నిర్భాగ్యుని వివాహమాడుట చేతగదా యిట్టి సంకటములు నీకుఁ బ్రాప్తించినవి ఇక్ష్వాకువంశ వర్ధనుండనియు సకల సామంత నృపాల కిరీట దీపిత పాదసరోజుఁడనియు, భావించి ఈ రామచంద్రుని భర్తగా గొని యానందించి నందులకు నీవందు చున్న సౌఖ్యభోగము లివియేకదా!

లక్ష్మ—అన్నయ్యా! ఈ విచారమేమి.

తే. గీ. అవనిభారము వాప ని ♦ ట్లవతరించి
నట్టి యాదినారాయణుం ♦ డగుదు వీవు
మానవుని లీల నీభంగి ♦ మగువకొఱకు
జింతనందిన; నేమని ♦ చెప్పఁగలము.

భర—ఇట్లు ధైర్యము విడిచి చింతించుచుండిన, నీకుఁ జెప్పుటకు మే మెంతవారము?

శత్రు—అన్నయ్యా! విచారింపవలదు.

(శ్రీ)రా—

తే. గీ. నాధుఁడీరీతిఁ జేయ న ♦ నాధనైతి
ననుచు జింతించుచుండు న ♦ వ్వనిత వనుల
ఏనితదలపోసి మదిలోన ♦ బహుళదుఃఖ
మేను గాంచుచుంటిని ధైర్య ♦ మెట్లుకలుగు

హా! విదేహరాజకుమారీ! ఎంతమూచినను నీజాతకమున నెక్కడసుఖమైన లేదు కాబోలు. ఆగర్భ శ్రీమంతుఁడగు రాముని కిల్లాలువైయుండియు, నీకు ఘోరకాంతారమే నివాసగృహమయ్యెను కదా! ఆవిరించి నీయెడల గరుణించక నీమొగంబున నిట్టివ్రాత వ్రాయుటకుఁ దొలిజన్మమున నేమిచేసియుంటివో కదా?

లక్ష్మ—అన్నయ్యా! రామచంద్రా? నీకుఁ దెలియని విషయము జగంబున నేదియులేదు. అట్టి నీవే వివేకమును విడిచియిట్లు బహుదుఃఖమును బొందుచున్న నేమని యూరడింపఁగలము.

మ. అమలాంగిన్ గొనియున్న పైనను నప ♦ త్యప్రాప్తికై చింత; కూటమి మొందైన భరింపఁ జింత కడుజా ♦ డ్యాగ్రస్థతన్ జింత; సౌఖ్యములున్ గల్గకయున్నచింత, కష్టములు గ ♦ ల్గన్ జింత సంసారకూపమునంగూలినవారి కెల్ల నివి సం ♦ ప్రాప్తించుగాదే భువిన్.

లోకమునఁ బ్రతిమానవునకు నీవిధమున్నది. ఏవిచారములేక జీవయాత్ర సుఖముగా గడుపు మానవుఁడు నూటికొక్కడైన నుండునో లేదో.

భర—అఖిలధర్మసంవేదివి నీకుఁ దెలియని రహస్యమేమున్నది?

తే. గీ. సకలమైనట్టి భాగ్యముల్ ♦ చంచలములు
జీవితంబులు జూడ న ♦ స్థిరములె కద
తామరాకుపై వికుచు ను ♦ దకముకరణి
నీవెఱుంగని ధర్మముల్ ♦ లేవుకాదె.

శత్రు—అన్నయ్యా! ఈపుత్రమిత్రభ్రాతృకళత్రాదులతోడిసంబంధము

ప్రవాహావశమున గొట్టుకొని కలిసివచ్చి పిదపవిడిపోవుడి కాష్ఠములవంటిది. దీనికై యిట్లు పరితపింపనేల?

శ్రీరా—(లక్ష్మణుని జూచి)

చ. తమతమబంధులందలఁచి ♦ తద్దయుదుఃఖము బొందునట్లుగా
సమరముఖంబునందుఁ గను ♦ శౌర్యము జేర్చి వధించినారమా
యమరవిరోధులన్ రమణి ♦ కై యనుజన్మడ యిప్పుడేమి సౌ
ఖ్యములను గాంచఁ గల్గితిమి ♦ కంజజువ్రాతను దాటశక్యమే

హా! సీతా! పావనారుంధతీవినుత ప్రశస్తసుగుణశీలా?

చ. జనసుతకీర్తి శాలురగు ♦ సత్సుతులంగని, లోకమందు, మా
మనుకుల వృద్ధిఁజూతువని ♦ మానసమందు దలంచియుండఁగా
వనపభవుండు నెన్ను నట ♦ వ్రాసినవ్రాతకు నేమనందు, హా
వనజదళాయతాక్షి! వన ♦ వాసము నీకును దప్పదయ్యెగా.

గర్భవతివైతివి. నందనోదయ భాగ్యంబునందుదువు. రవికులవర్ధన కుమారోదయమున కెదురుజూచుచు నువ్విళ్ళూరుచున్న వారియాశ లన్నియు నిరాశలయ్యెనుగదా? హా! తరుణీమణీ! తనయనంతరము మిధి లాపుర రాజ్యసింహాపీఠము నధిష్ఠించు నందనుని నీవు గందువని మీతం డ్రియగు జనకరా జెంతయో మోదమందుచుండెను. అక్కటా? అట్టి కోరికకు నేనుభంగ మొదవించి పాపముగట్టుకొంటినిగదా? నిన్నరణ్య ములకు బంపితినని జనకుఁడు విని శ్రీరామచంద్రుఁ డెంతకఠినాత్ముఁడని నన్నుదూరునో! పావనంబైన యజ్ఞవేదికాతలంబున నవతరించిన యాది లక్ష్మివే నీవని సంతసించి, యతిగారాబమున నిన్నుఁ బెంచి శ్రీరామ చంద్రుఁడు ధీరుఁడు ఇతరపురుషదుర్లభములగు లక్షణములున్నవి. అల్లుడ గుటచే ధన్యుఁడనగుదునని దలంచి నాకొసఁగినందులకు నీకిట్టి కష్టముల గల్పించితినిగదా?

(లక్ష్మణునిఁ జూచి)

ఉ. పుట్టినతోడనే పరమ ♦ పూజ్యచరిత్ర; సుశీలతాగుణం
బిట్టిదటంచుఁ బల్కఁగను ♦ నెంతటివారికినైన శక్యమే
కట్టడిదెచ్చిపెట్టితిని ♦ గానల కంపి, యికేమనందు నా
కట్టితలోదరీమణి స ♦ హస్రభవంబులకైన గల్గునే.

ఉ. వారణయానపై మనస ♦ వారితమాటను మోమునంసు సిం
ధూరము దూరమయ్యె, మది ♦ దోచను; మిత్రులుబల్కవాక్సనం
భారము భారమయ్యె; యిక ♦ వైరముహారము? రత్నమాధిరా
వార మరణ్యమయ్యె; నను ♦ వంచనజేసెను దైవమక్కటా?

తే. గీ. నిండుగర్భిణియైన యా ♦ నీరజాక్షి
గరుణఁ బూనక యావిధిఁ ( గానకంపి
గట్టుకొంటిని పాపంబు ♦ కట్టికుడుప
దా! పలువిధంబుల నను నో ♦ తమ్ములార.

సీత నెడబాసియున్న దుఃఖముకంటె, యిట్టిమహాపాపము గట్టుకొంటిని గదా యని చింతించుచున్నాను.

లక్ష్మ—అన్నయ్యా!

చ. గతజలసేతుబంధమున ♦ కై వగవంబనిలేదు ధారుణీ
పతులుముదంబునందగ న ♦ వారణవిక్రమలీలఁ జేయుమీ
క్షితిని దురంగయాగమును ♦ చిత్తముస్వస్థతగాంచు సద్యశం
బతులిత లీలగాంచెదవు ♦ భానుకులాంబుధి పూర్ణచంద్రమా.

రామ—తమ్ముఁడా! ఈసంగతి నాకుఁ జక్కగ జ్ఞాపకమునకుఁ దెచ్చితివి. రావణుని వధించిన నాటనుండియు, నశ్వమేధయాగము చేయవలయు ననియే తలంచుచుంటిని. కాని యెప్పటి కప్పుడే మఱచిపోవుచుంటిని. అశ్వమేధయాగము బ్రహ్మహత్యాపాతకముగూడ వారించును. కావున నింకులఁ గూర్చి తగిన ప్రయత్నము సేయవలయును.

భర—(ప్రకటం జూచి) మనకు తలంచినంతనే భగవానుఁడగు వసిష్ఠ మహర్షి కూడ సాక్షాత్కరించుచున్నాఁడు.

శ్రీరా—భాగ్యము.

వసి—(ప్రవేశించును.)

రా-ల-భ-శ—మహర్షివర్యా! వందనములు.

వసి—శుభప్రాప్తిరస్తు.

శ్రీరా—మునికులతిలకా! ఈ మణిపీఠము నలంకరింపుము.

వసి—(ఆసీనుఁడగును.)

శ్రీరా—మునిచంద్రా! లోకవిద్రావణ రావణసంహారజనిత బ్రహ్మహత్యామహాపాతక నివారణార్థమై యశ్వమేధయాగము సేయవలయుననితలంపు పుట్టినది. ఈవిషయమున నీవు మాయెడల గరుణించి తద్విధానం బెఱిగించి నన్నుగృతార్థుని జేయవలయునని ప్రార్థించుచున్నాను.

సేవ—(ప్రవేశించి) దేవా! నారదమహర్షియు విశ్వామిత్రమునీంద్రుఁడును నరుదెంచి ద్వారముకడ నిలిచియున్నారు.

శ్రీరా—ఆ మహానుభావులకాటంక మేమియున్నది. శీఘ్రంబుగ లోనికిం బ్రవేశపెట్టుము. (తనలో) నారదుఁడు గూడ నీసమయమునకే వచ్చెనే. వసిష్ఠ విశ్వామిత్రులాజన్మవైరులు. ఇప్పుడు వీరికేమి కలహము ప్రాప్తించునోకదా?

[నారద విశ్వామిత్రులు ప్రవేశింతురు.]

శ్రీరా—(ఆసనమునుండిలేచి) మునింద్రులారా! నావందనము లందుకొని యీ పీఠంబులపై నాసీనులగుడు.

విశ్వా-నార—అఖిల శుభావాప్తిరస్తు. (ఆసీనులగుదురు).

వసి—రామచంద్రా! అశ్వమేధయాగవిధానము నన్నడిగితివి కావున జెప్పెద నాకర్ణింపుము. శ్వేతవర్ణంబును, సువర్ణచ్ఛాయగేరు

దీర్ఘ పుచ్ఛంబును, విశాలశ్యామల కర్ణంబులును గలిగిన దివ్యా శ్వమును నలిక భాగమున బిరుదపట్టముగట్టి, యజ్ఞదీక్షఁ బూని విడువవలయును. యజ్ఞాశ్వరక్షకులుగా శౌర్యధనులును పోవల యును. సధర్మాచారపరాయణులగు బ్రాహ్మణులు ఋత్విజులు గానుండవలయును. వారికొక్కరికి స్యందనము, వారణములు, సువర్ణ రజితములు గానుకగా సమర్పింపవలయును. యజ్ఞాశ్వము భూమండలంబెల్ల యంగరక్షకులు వెంట నరుగ భూమండల మం తయుఁ జరింపవలయును. అశ్వ మెవ్వరిచేతనయిన బంధింపఁ బడినచో యాగమునకు విఘ్నమగును.

విశ్వా—(తనలో) అనాదిగ నీ యరుంధతీరమణుఁడు సూర్యకులము వారికిఁ బురోహితుఁడై యుండుటచే నున్నవికొన్నియు లేనివి కొన్నియుఁ జెప్పి యెట్లో ధనముఁగైకొనుటకుఁ దలంచుచున్నను. వీనిమాటలకు నే నడ్డముగిలిగించెదగాక ! (ప్రకాశముగా వసి ష్ఠునిఁ జూచి) వసిష్ఠా ! పురోహితశబ్దము వృధగాఁబోనిచ్చితివి కావు. ఏదో తీరుగ విత్తమార్జించుటకే ప్రయత్నించుచుందువు. అంతియేకాని ధర్మాధర్మ విచారణము మాత్రము నీ కవసరము లేదు. సమస్త ధర్మ కార్యములకును, సమ స్తాతిధియభ్యాగతి దేవతాపూజలకును సద్గతులకును గృహిణులే మూలమును సంగతి మఱచితివా యేమి? సీత లేకుండ యశ్వమేధయాగమును సేయుటకు రాముఁ డెట్లర్హుఁడగును? ఏవిధమునఁ జేయింపదలంచి తివి? నీ కెవ్వరైన ధనమిచ్చినఁ జాలును. నీకిట్టిమహాత్కార్యము లవిషయమై యేమియైనఁ దెలియునా?

వసి—నీబోటి సహజకోప చిత్తునితోఁ దెలియునని చెప్పిన నేమిలాభ మున్నది. తెలియదని చెప్పిన నేమిలాభమున్నది? నీతోఁ ననవ సరముగ సంభాషించుచుఁ గాలయాపనము సేయుటకు నాకు

మనముసమ్మతింపదు. నిష్ప్రయోజనమగు సంభాషణముతో నాకు బనియేమున్నది?

విశ్వా—పాపచరితా! వసిష్ఠా! మాతో సంభాషించుట నిష్ప్రయోజకమనియే భావించితివిగా! అట్టివాడవు తెలియనిసంగతులు తెలియునని నటించి విత్తమూర్జించుట కుద్యోగించెద వేల? చేతకానివాడవు నోరుమూసికొని యూరకుండవలయును. అపత్నీకుఁడు యాగము సేయుట కెట్లర్హుఁడనితలంచితివి. అగ్నిహోత్రాధికారము సరిలేకుండ నెట్లువచ్చునని తలంచితివి. నీకుఁజెల్లించవలసినకట్నము రాముఁడుచెల్లించినఁ జాలునా! లోకధర్మముతోఁ బనిలేదా? నీకు జనించిన కుమారులందఱును స్వర్గగతులయిరి. ఎవ్వరినిమిత్త మిట్టి యకార్యములుచేయించి,యనృతములాడి ధనమార్జించెదవు? నీముఖము జూచిన బంచమహాపాతకములు సంభవించును. విశ్వామిత్రుఁడనువాడొకఁడీజగమున నుండుటచే నీవిట్లుంటివిగాని, లేకున్న నిన్నుఁబట్టుటకుఁ బగ్గములుండునా?

నార—(తనలో) వసిష్ఠుఁడనుపేరు విన్న మండిపడు విశ్వామిత్రుఁడు కలహమునకు దిగినాఁడు. దీనినిఁ బెంచెదఁగాక. (ప్రకాశముగా) గాధేయుఁడుచెప్పిన వాక్యము సమంజసముగనే యున్నది. జానకి లేకుండ యాగముసేయుట కారంభింపరాదు. ధర్మమునకేమి! ఏదియో తెచ్చిపెట్టుకొని సమర్థింపవచ్చును. ఇంతకును విశ్వామిత్రునకు విచారమొందులకనిన సీతావివాహమునకు విశ్వామిత్రుఁడే కారణము. సీతను రాముఁడు వివాహమాడుటకితఁడే మూలము. తనమిత్రుఁడగు జనకుని కూతురా రీతి నరణ్యముల పాలయినదని మిగుల విచారించుచున్నాఁడు. నీవుచేసిన సంబంధమున కెన్ని పాట్లు వచ్చినవో చూచితివా యనిజనకుఁ

డీతని నెట్లు బలుకునో యని యాతని మొగమైనఁ జూచుటకు సిగ్గుబొందుచున్నాఁడు. సీత లేని యాగము ఎట్టివారికైనను విచారమేయనినప్పుడు కౌశికునిమాటఁ జెప్పనేల?

శ్రీరా—మహాత్మా! నారదసంయమీంద్రా! కలహ క్రోధానలము నుపహాసూచిత వాక్య సమిధలు వేసి బ్రజ్వరిల్లఁజేయుటకు నిన్ను మించినవారు లేరు. దేవా! నీ వేల వీరికలహమును నధికము జేయ జూతువు. నీవూరకొనుటకుఁ బ్రార్థించుచున్నాను.

వసి—కౌశికా! సింహగర్జనములు సేయుచు, బ్రల్లదంబులు పలుకుఁ నీకిక్కడ నెవ్వరును భీతిల్లువారు లేరు. జంకుఁ గొంకు లేక, కన్ను మిన్ను గానక నీయిష్టమువచ్చినట్లెల్ల ప్రేలెదవుగాని ధర్మము ననుసరింపవు. హేమముతో సీతాప్రతిరూపమును గల్పించి యాగము సేయుట కేవిధమయిన యాక్షేపణయు లేదు. నీకుఁ దెలియని విషయములలో దగుదునని సభయందు నోరెత్తి మాట్లాడవలదు.

విశ్వా—(నవ్వి) హేమమున ప్రతిరూపము జేసినంతమాత్రమున నే సీతయగునా? ఎంతచక్కని ధర్మము తెలిపితివి. ఈసమయమున నిన్నేమిచేసినను చేయవచ్చునుగాని, మదీయ సవనపరిపాలకుఁడగు శ్రీరామచంద్రుని ముఖముజూచి నిన్ను వదలుచుంటిని. ఏదో తంత్రముజేసి నీపొట్ట నింపుకొనుము. నాందారి కేఁబోయెదను. ఏమయినను సీతవచ్చునకాని యాగముమాత్రము సమాప్తి కాదని నేను నొక్కి వక్కాణింపఁగలను.

(నిష్క్రమించును.)

వసి—రామా! విశ్వామిత్రుని రిత్తవాక్యములతోఁ బనిలేదు. నేఁ జెప్పినట్లు నీవు యాగారంభుఁడవు గమ్ము.

నార—రామచంద్రా! సుగుణసాంద్రా?

తే. గీ. శౌర్యవిక్రమ భుజబల ♦ శాలు లయిన
ముగురుతమ్ములు గలరు మ ♦ మ్మూర్తులనఁగ
వారుసాధింపఁగల రెట్టి ♦ పనినినైన
క్రతువొనర్చి యశంబును ♦ గాంచుమింక.

రా—మీవంటి ఋషిశ్రేష్ఠులదయ యున్న నాకేవిధమయిన గొఱఁతయు సంభవింపదు. క్రతుహయసంరక్షణార్థము శత్రుఘ్నుండును, సకలబంధుకోటిని బిలుచుటకు భరతుఁడును, జనకభూపాలుని ప్రార్థించి తోడితెచ్చుటకు సౌమిత్రియు నరుగుదురు.

వసి—బాగున్నది.

నార—అట్లు చేయుము.

శ్రీరా—తమ్ముఁడా! శత్రుఘ్నా! నీవు మఖవాజి కంగరక్షకుఁడవై చతురంగబలసమేతంబుగా నరుగుము.

ఉ. పౌరుష మ్ముండెగా యనుచు ♦ వారిని వీరిని జంపఁబోకు; మే
తీరున నైన శత్రులమ ♦ దిన్ భయమొట్టగ జేయు మంతియే
ధారుణిలోన నందఱను ♦ దర్పమడంచిన, యేమికాంతు మా
తీరున లంకలోన మను ♦ తెంపరినై వధియించితిన్ గదా.

తే. గీ. బలముఁగలదంచు గర్వించి ♦ వైరితతిని
గెల్చి వారిభార్యలఁ సుతుల్ ♦ గుందునట్లు
ధనము గైకొన బోకుము ♦ తండ్రి! యెవరి
కొఱకు మనము సేయుదు మిట్టి ♦ కృత్యములను.

మ. నిరతంబుల్ శివుగొల్చు, రావణునకున్ ♦ నిర్జించి ఘోరాఘమున్
ధరణిన్ గాంచితి, దానిబాయుటకునున్ ♦ ధర్మాంగినిన్ గానకున్
గరుణాహీనత బంపినందుకును, యా ♦ గం బిప్పుడు సేయంగ, సో
దరులా మీరుపచింప, నొప్పితినిగా ♦ దా! నీవు యోచింపుమా.

నానాన్నృపాలురకును వినయపూర్వకముగా నావచనముగాలు నిట్లు పలుకుము.

ఉ. పౌరుషముండికాదు యిటు ♦ భవ్యమఖంబును సేయుచుంట, యా
కూ్రరుని రావణాసురుని ♦ గూల్చిన పాపము బాయఁజేయఁగా
నారయ సేయుచుంటినిది ♦ యాగ్రహముందక, నాను యాగ మిం
పారఁగఁ జూచిపోవుటకు ♦ నందఱురంను ముదంబు నందెదర్.

శతు్ర—ఆజ్ఞననుసరించెదఁగాక. (నిష్క్రమించును.)

శీ్రరా—భరతా! నీవేగి మనబంధుజనంబుల నందఱ నాహ్వానించుచు నావచనంబులుగా నిట్లుఁబలుకుము.

ఉ. బంధురలీల యాగమును ♦ భవ్యమతిన్ బొనరింపనుంటి, స
ద్బంధువులార! నాయెడఁ గృ ♦ పారస మూని ముదంబుమీర మీ
రిందుల కేగుదెంచి; మఖ ♦ మెవ్విధినో నెఱవేరఁజూడుడీ
బంధుఁడ మీవిధేయుఁడను ♦ బా్ర్ధనఁజేసెద మిమ్మునందఱన్.

భర—అన్నయ్యా! నీవుచెప్పినట్లు చేసెదను. (నిష్క్రమించును.)

శీ్రరా—లక్ష్మణా! నిరంతరమదాజ్ఞావిధేయా? జనకమహారాజును నీవుదోడ్కొనిరావలయును. అమ్మహాత్ముని నీ వతివినయముతో సమీపింపవలయును.

తే. గీ. తగినవరుఁడు పుతి్రకకంచుఁ ♦ దలఁచి నాకు
బరిణయముజేసె సీతను ♦ పాపినగుచు
మగువ కిడుములు గల్పించి ♦ మామకుదికి
ఘోరదుఃఖంబు నిరతంబు ♦ గూర్చుచుంటి.

అందుచే నాతనికి నామారుగ ముకుళితకరకమలుఁడవై నమస్కరించి యిట్లు విన్నవింపుము.

మ. తనయన్ గానకు బంపి యేకరణి జి ♦ త్తంబందు సిగ్గిల్ల కీ
మనువంశాగ్రణి నన్నుఁబిల్వ ననుజుం ♦ బంపించెనంచున్ మనం

బునగోపింపఁగఁబోకు వేడెదను మ ♦ మ్ముం బ్రోచు భాగంబు నీ
దని సత్యంబుగఁ బల్కుచుంటి నివిగో ♦ దండంబు లర్పించెదన్.

తే. గీ. పట్టి లేకున్న నేరీతి ♦ వత్తు మనుచు
సడ్డు వచియింపఁగాఁబోల ♦ దయ్య మీకు
బిడ్డఁగూడిన మేమింత ♦ పిలువకుండ
తారె యేఁగుదెంతురు కాదె ♦ ధరణిపాల.

లక్ష్మ—అన్నయ్యా! మంచిది. అమ్మహానుభావుని నేరీతినైన బ్రతిమాలి తోడ్కొనివచ్చుభారము నాయది.

వసి—రామచంద్రా! ఇఁకనీవు తత్ప్రయత్నమున నుండుము గాక,

నార—రామా! నేనిక పోయివచ్చెదను.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.





శ్రీ

# కుశలవపట్టాభిషేకము.



## చతుర్థాంకము.

రంగము:—[పర్ణశాల:—సీతప్రవేశము.]

సీత—

చ. జననిరో పెట్టుమా యిపుడు ♦ చల్దినియంచును నిద్రకన్నుతో
మనమలరంగఁ బల్కెడు కు ♦ మారుఁడు నా లవుఁ డేలరాఁడు; ఆ
దినమణి మింటి తీక్ష్ణుఁడగు ♦ తేజము దాల్చి చరించుచున్న నా
మనమది యేమొ కొంత యను ♦ మానము నందెను; నేమి హేతువో

ఈ లవుఁడు కుటీరము విడిచి యావలకుఁబోయినచో మరల నింటికివచ్చువఱకుఁ బ్రాణములన్నియు వానిమీఁద నే యుండును. ఎప్పుడును నేదియో యల్లరిపనియో, లేక యేసాహసకార్యమో, సేయుచునేయుండును.

సీ. గురునిగడ్డముఁజూచి ♦ కొంటియై నవ్వుచు
నుయ్యాలగాబట్టి ♦ యూఁగుచుండు
వనవీధులకు బోయి ♦ ఘనమృగంబుల దెచ్చి
యాశ్రమంబునఁ గట్టి ♦ యలరుచుండు
తోడిబాలురఁ గూడి ♦ యాడి తుదకుఁ గొట్టి
కొంపమీఁదికి బోరు ♦ గూర్చుచుండు

శరవిద్య పూర్తిగా ♦ గరచినాడను; నిక
నాకేమి యుండును ♦ నవ్వుచుండు

తే. గీ. చదవరా తండ్రి యన్నయా ♦ శ్రమమె చేక
కుండు; నేమి సేతు లవుని ♦ గురుడు కోప
మూద డేమ శిక్షింప నా ♦ యాత్మ సమ్మ
తింపదయ్యొ గమ్మపురాటి ♦ తీపి కలదె.

(ఎదుటఁజూచి) అహో! కుశలవుల చెలికాడగు మునికుమారుఁడు కాబోలు వచ్చుచున్నాడు. ఎప్పుడును నా లవకుమారుఁ డీతనితోడనే యుండును. ఇప్పు డీతనితో వచ్చుటలేదు. నామనం బెందులకో పరితాప వార్నిధిని మున్గుచున్నది.

[మునికుమారుఁడు ప్రవేశించి నిలచియుండును.]

సీత—(మునికుమారునిఁ జూచి) మునికుమారా! నిరతము నీతోఁ దిరుగుచుండు నా లవకుమారుఁ డేడి? ఆతఁడు నేఁడు నీవెంట రాలేదా! ఇప్పు డెక్కడనున్నాడు?

మునికు—అమ్మా! మీ కుమారుడగు లవుఁడును నేనును విలాసార్థముగా మాటలఁ జెప్పుకొనుచు సమిత్కుశఫలాహరణార్థమై గంభీరకంఠీరవధ్వనితాకంపితాఖిలహరిద్వదేభసంతానమును ఖడ్గవ్యాఘ్రాది భయంకర జంతుసంయుతమును అఖిలపక్షి సంకులరవాక్రాంతమును నైన యొక కాంతారమును బ్రవేశించి యుండదండు జరించుచుండ—తల్లీ! ఏమనిచెప్పుదును? ఎక్కడనుండియో శ్వేతవర్ణంబును, దీర్ఘపుచ్ఛంబును, ఇంద్రనీలద్యుతినిహసించు శ్రవణంబులును మారుతజవంబును గలిగిన యశ్వశ్రేష్ఠము మేమున్నవైపునకు వచ్చినది. అట్టి యశ్వరాజమును మేమెప్పుడును జూచియుండలేదు.

సీత—అది యెవ్వరి యశ్వరాజమో! వెంట నెవ్వరు లేకుండ నయ్యరణ్య ప్రదేశమున కేల వచ్చెనో! నాయనా! నూపట్టి మిగుల దుడుకు వాడు. తొందరపడి వాడుగాని నీవుగాని దానిం బట్టుకొనుటకు బ్రయత్నించ లేదుకదా?

మునికు—ఇదిగో చెప్పుచున్నాను. తల్లీ! వినుము. అట్లరుదెంచిన అశ్వరాజమును గని లవకుమారుఁడు రయమున బరుగిడి దాని నాపెను.

సీత—అబ్బా! ఏమితొందర! వీని కెంతచెప్పినను సాహసకార్యములు మానక యుండెనుకదా. తరువాత చెప్పుము మునిబాలకా!

మునికు—అట్లు పట్టుకొనిన యశ్వమునకలికభాగమున నొక బిరుదు పట్టము గట్టఁబడి యుండెను. అందలి విషయములఁ జూచినంతనే నీకుమారుఁడు దండతాడిత మహోరగంబుకరణి దురాగ్రహావేశపరవశుఁ డయ్యెను.

సీత—ఆబిరుదుపట్టమున లిఖింపఁబడియున్న విషయములఁ జూచినంతనే కుమారుఁడగు నితఁడు దురాగ్రహావేశపరవశుం డగుటకుఁ గారణమేమి?

ముని—ఏమున్నది. అందలి వ్రాతయే యతని కాగ్రహము కలిగించినది.

సీత—కుమారా! అందేమివ్రాయబడియున్నది?

మునికు—ఇయ్యది వీరసువు సూనునిచే విడువఁబడిన క్రతుతురంగము. శూరు లెవరైన నున్నచోఁ బట్టుడని వ్రాసియుండెను.

సీత—దాని కీకుమారున కేల యాగ్రహ మొదవెను?

మునికు—ఇప్పుని సాహస మేమని చెప్పఁగలను? ఆ బిరుదపట్టమున నున్న వ్రాతగాంచి "వీరసుప్రసూనునిచేత విడువఁబడిన క్రతు తురంగమఁట. శూరులుండిన బట్టవలయునట. ఏమీ! లోకమున

నీతఁడే శూరుఁడా! ఈతఁడే వీరసుప్రసూనుఁడా! నేను వీరుఁడను గానా! మాతల్లి సీతామహాదేవి వీరమాత కాదా! కానిమ్మిం. వీరి గర్వమేమో యించుక విచారించెదను" అని మేఘగంభీర భాషణంబునఁ బలుకుచు నయ్యశ్వమును బట్టుకొని, యా సమీపంబున నున్న యొక వటవిటపికిఁ గట్టివేసెను.

సీత—తాపసనందనా! లవుఁడు బాల్యచాపల్యమున నట్టి సాహసకృత్యమును జేయఁదలఁచి యుండునుగాక! వలదని వారింపక పోయితివా? నీమాట నాతఁడు వినునే!

మునికు—అమ్మా! నే నూరకుంటినని తలంచుచుంటివా? "మిత్రుఁడా! లవా! ఇది యెవ్వరిదో యొక మహారాజు క్రతువాజి. ఈ హయమొక్కటే యిట్లు వచ్చియుండునని తలంపకుము. వెనుకనుండి వీరులు వచ్చుచుందురు. దీనిం బంధించుటచేత మనకపాయము వాటిల్లఁగలదు. వెనుకనుండి వచ్చు నశ్వరక్షకులు మనల నూరక పోనియ్యరు అదియుంగాక, వనంబుల వసించుచుఁ గందమూలముల భుజించుచుఁ గాలము గడుపు మునికుమారులమైన మనకట్టి సాహసకృత్యము లేల? విడువు" మని చెప్పితిని.

సీత—అట్లు జెప్పినను వినలేదుగా!

మునికు—విన్నచో నింతగాథ యేల పెరుగును. మా శాంతవచనములాతని శ్రవణరంధ్రంబులఁ బ్రవేశింపలేదు. అతఁడు మమ్ముఁ గాంచి నీవు బ్రాహ్మణకుమారుఁడ వగుటచే, నిట్టి పిఱికి వాక్యములఁ బలుకుచుంటివి. ఇట్టి బిరుదపట్టమును జూచి శూరుఁడనగు నేను సైరించుటెట్లు? అశ్వమును విడుచుటయెట్లు? వాల్మీకమహామునీంద్ర కరుణా సమార్జితాస్త్రవిద్యా విరాజితుఁడనగు నాకు జతుర్దశ భువనములయందును నెదురు లేదు.

ఇట్టి వీరకృత్యములకు నాబోటి శూరులు గడంగక శాంతము వహించి యూరకొనజాలరు. మిత్రమా ! నీవు భయమందకు" మని పలికి, బంధించిన యశ్వమును జూచుచు నచ్చటనే యుండెను.

సీత—వీ డెవ్వరు చెప్పినమాటను వినుఁడు. తన కెంతతోఁచిన యంత. చేటు పాటు లెఱుంగఁడు. నాయనా ! తరువాత చెప్పుము.

మునికు—అమ్మా ! కొంత సేపటికి కొందఱు వీరులు తన్నుఁ గొలిచిరా రథారూఢుఁడై యట కరుదెంచి యశ్వము బంధింపబడి యుండుట జూచెను. అ భూపాలుఁ డెవ్వఁడో తెలియదు గాని యతని పంపుననే కాబోలు తదీయ దండనాథుం డరుదెంచి యశ్వము ప్రక్కనున్న లవుని వీక్షించి "వీరాగ్రేసరుడగు మా నరపాల చంద్రుఁడు విడిచిన క్రతువాజిని బంధింప సాహసించిన యా చెనటి యెవరు" అనిపలికెను. దండనాయకుని నోటినుంటి యా నుడులు వెడలినంతనే మన లవుడు త్రిపురసంహారము సేయఁ బోవు నిటలాక్షాకృతిని బోలిచి, వీరాగ్రేసరుఁడగు మా నర పాల చంద్రుడు విడిచిన క్రతువాజిని బంధింప సాహసించిన యా చెనటి యెవరు అనియా యడుగుచుంటివి ! హాయంబున కలికభాగమున గట్టబడి యున్న బిరుదపట్టముజూచి, నేను శూరుఁడను, వీరుఁడను, ధీరుఁడను నగుటచే నశ్వరాజమును బంధించితిని. తెలిసినదా ! ఒకవేళ నాశౌర్యము జూడఁ దలంచితివేని రణరంగమున కవతరింపుము" అని పలికెను.

సీత—(తనలో) అక్కటా ! కుమారా ! వయసునకు మించిన కార్యములు చేయఁ దలఁచుచుంటివే! నీ యల్లరి పనులకును, నోటి తొందరకును దల్లినగుటచే నేనును, శస్త్రాదివిద్యల నొసంగిన గురుండును, సకల ధర్మసంవేదియు శాంత స్వభావుఁడును,

మునిచంద్రుఁడును నగుటచే వామలూరు సంభవుడును శాల్మి వహించుచుందుము గాని యన్యు లూరకుందురా! (ప్రకాశముగా) మునికుమారా ! తరువాత?

మునికు—మన లవకుమారుని రోష భీషణ వాక్యములు తీవ్రశరముల చందమున దండనాయకుని శ్రవణ రంధ్రంబులఁ బ్రవేశింప నతండు గుహాయందు నిద్రించు సింగమును మేల్కొలిపిన నెంత కోపమును బూనునో యట్టి రౌద్రమున మండిపడుచు, బాలుని గదియ సమీపించి మరల నొక్కింత శాంతము వహించి లవుని దిలకించి "బాలకా ! నీవు వనంబులఁ జరించు మునికుమారుఁడవు. అట్టిచో యజ్ఞాశ్వముతో నీకుఁ బని యేమున్నది. అవివేకమున బంధించుటయే గాక, మాతోఁ గయ్యమునకు గాలు ద్రవ్వుచుంటివి. నీవిధము జూడగా జంబుకము సింగము నెదిరించుచందముగ నున్నది. రాజుల క్రోధాగ్ని కింధనమై మీ తల్లి దండ్రులకు జంతగూర్పఁ దలఁచితివేల ? నీ సాహసమును విడిచి యశ్వమును విడువుము. బాలుఁడ వగుటచే నింతవఱకుఁ జెప్పితిని. మఱియొక్క డీయశ్వమును బట్టి యుండెనేని యీపాటికి యమసదనమును జేర్చియే యుందును" అని బహువిధములఁ బలికెను.

సీత—నాయనా ! అట్లు జెప్పినను వినలేదుగా !

మునికు—ఏలవినును. దండనాయకుని పలుకులు రోగికి పథ్యమురుచించనట్లు మన లవునకు వెగటుగ దోచుటయేగాక, యక్షీణ రూక్షేణములనుండి విస్ఫులింగములు గుటియించుచు దండనాయకుని విలోకించి " ఓయీ ! నేను బాలుండనని నీవు సంశయింప నవసరము లేదు. నేను బాలుఁడనయ్యు సంగరమున వీరుల పాలిటికి గాలుడ నగుదును. నాతో రణమొనర్పఁజాలక

భయమంది యెట్లయినను దాటి యావలకుఁ బోదమను తలంపుతో నీవిధమున బలుకుచున్న విధము తోఁచెడి. ఇక నీతోనే ననవసరమగు సంభాషణంబునఁగాలయాపనము సేయనెల్ల. రణముఖమున నిలిచితి వేని తీవ్రశరంబులఁ బ్రత్యుత్తర మిచ్చెద" నని పలికెను. పలుకుటయే గాదు. నిశితనారాచంబుల రెండు దండనాయకునిపైఁ బ్రయోగించెను.

సీత—అక్కటా! వీని తొందరకు నే నేమని వగతును. మునికుమారా! తరువాత నేమి జరిగినది?

మునికు—దండనాయకుఁ డిక శాంతివహింపరాదని తలచి హరిణంబును దాకు మృగేంద్రుని లీల లవునిదాకి తీవ్రశరప్రయోగము సేయుటయే గాక తనబలంబునుగూడ పురికొల్పెను. ఆ సైనికు లెల్లరు నిచ్చవచ్చినలీల విధివిరామము లేకుండ గుమారునిపై శరవర్షముగురిపించిరి.

సీత—(విచారముతో) అయ్యో! కుమారా! ఆరితేరిన శూరులు ప్రయోగించు శరములు నీమేన నెట్లునాటినవో కదా! తరువాత?

మునికు—అమ్మా! లవకుమారుఁ డంతుల కేమయిన వెనుదీసెనా? లేదు. లేదు. ప్రతిపక్షులు ప్రయోగించు శరము లన్నియు ఖండించుచు "రణభూమినుండి తొలగక నిలువుడు. బాలునిచే బ్రయోగింపబడు శరములచవిఁజూడుడు. అనిపలుకుచు మధ్యాహ్నకాల విరాజిత చండ మార్తాండుని చందమున వెలుంగుచు వివిధనారాచ పరంపరల బోరుచు నిమేష మాత్రములో సైన్యము పలాయితమగునట్లు జేసెను.

సీత—(తనలో) రామునితనయుఁడుకాడా! (ప్రకాశముగా) మునికుమారా తరువాత నేమి జరిగినది?

మునికు—సైన్యము పటుగెత్తి దొడగనది. ఆకారణమున దండనాయకు నికేర్పడిన క్రోధము రూపముదాల్చినది. వెంటనేయాతఁడు కరీంద్రునిపైకి లంఘించు మృగేంద్రుని చందమున లవునిందాకి తీవ్రమైన శరంబొకటి యతనిమోముపై దగులునట్లు ప్రయోగించెను.

సీత—(భయముతో) అయ్యో ! తరువాత ?

మునికు—లవుడు సేనాపతిచేఁ బ్రయోగింపఁబడిన శరమును ముత్తుని యలుగాఁ జేసి "ఓయీ ! ప్రగల్భముతోఁ గూడుకొని యున్న నీయట్టహాసమునకుఁగాని యస్త్రసంధానచాతుర్యమునకుఁ గాని యిక్కడ భయమందు వారెవ్వరును లేరు." అని ధైర్యముగ బలుకుచు నతనిం దాకి శరలాఘవము కరలాఘవము దీపింపఁ బోరి తుద కాతనిని యమపురికిఁ బ్రాతకాపుగఁ జేసి పంపెను.

సీత—(తనలో) ఇక్ష్వాకుకులయశోలతలు జగంబునఁ బ్రాకింపుటకే కదా యీకుమారులుజనించినారు. (ప్రకాశముగా) తరువాత?

మునికు—అమ్మా ! ప్రతిపక్షుల సైన్యమూ చెదరినది. సేనాపతియూ చచ్చెను. ఇదియంతయుఁ జూచుచుండిన భూపాలుడు క్రోధరసాధి దేవతయై లవకుమారుని డాసి విలయకాలభైరవునిలీల, హిరణ్యకశ్యపసభాస్తంభాంతరాళ ముద్భవుండగు నరహరి విధమున దుర్నిరీక్షుఁడై "మా మహారాజు క్రతువాజిని బంధించుటయేగాక తాపసబాలకుడవైన నీవు సాహసించి మాబలమును పలాయితమగునట్లు జేసి, దండనాయకుని దండధరుని ప్రోలికి బంపితివిగా ! కానిమ్ము. అందులకుఁ దగిన ఫలమిప్పుడే యనుభవించెదవుగాక!" యనిపలికి యొకయర్ధచంద్రబాణమును ప్రయోగించెను.

సీత—మునికుమారా ! భూపాలుఁడువచ్చినను మనవాడు వెనుదీయ లేదుగా !

లవు—పార్థి వేంద్రుని రాక లవుని నధిక ధైర్యసమగ్రునిగా జేసినది. భూపాలునిచేఁ బ్రయోగింపఁబడిన యర్ధచంద్రబాణమును ఖండించి మన లవకుమారుఁడు రెండుబాణములు తొడిగి యాకర్ణాంతము నారిసారించి భూపాలునిపై విడిచెను. నరపాలుఁడు వానిని ఖండించి యింక బాలుండని తలంపరాదని రథముపై నుండి నేలకు లంఘించి సమంత్రపూర్వకముగ నొక్కయద్భుతశక్తిని ప్రయోగించెను. అమ్మా ! ఆశక్తి ప్రభావమేమో తల్లీ ! చెప్పఁజాలను. లవకుమారుని నిముషములో మూర్ఛిల్లఁజేసెను.

సీత—హా ! కుమారా ! లవా ! (మూర్ఛిల్లి లేచును.)

మునికు—తల్లీ !! చింతింపకుము. అట్లు మూర్ఛిల్లిన లవకుమారుని తన రథముపైఁ బెట్టుకొని కడురయమునఁ బోవుచున్నాడు.

సీత—అయ్యో ! లవకుమారా ! నీకెట్టియవస్థ సంభవించినది.

తే. గీ. ముద్దులను వెదఁజిమ్ము నీ ♦ మోము గనియు
శరములబఱప నృపుఁడెట్లు ♦ సాహసించె
పరిమళవిరాజితమగు పు ♦ ష్పంబు నెవడు
గోటఁ జిదుమంగ నెంచును ♦ కో డుక భువిని.

చ. జనకుని సత్యశాసనము ♦ సమ్మతి బాలనసేయ నెంచి య
వ్వనముల కేగి విక్రమము ♦ భాసిల నెల్ల సుపర్వవైరులన్
దునిమి జగంబుమెచ్చఁగను ♦ దొరపుగీర్తిని గాంచినట్టి రా
మునకు సుతుండవయ్యు నిటు ♦ బుత్రక ! శత్రునిచేతఁ జిక్కితే.

హాదైవమా ! నాయెడల నీవింత నిర్దయవహించుటకు నేనేమి యపకారము జేసితిని ?

తే. గీ. భాగ్యభోగంబులను వీడి ♦ వనములందు
నున్న పుత్త్రులు సుఖముగా ♦ నున్న నదియె
స్వర్గమనియెంచి యుండంగ ♦ జాలిలేక
యిట్టి దుఃఖంబు గూర్చితి ♦ వే! విధాత.

కుమారా!

ఉ. తమ్ముడు గానరాడిట సు ♦ దమ్మున నాటల నాడ నేగనే
యమ్మరొ చెప్పుమంచు భవ ♦ దగ్రజు డిప్పుడు నన్నుఁ గోర నే
నెమ్మెయిఁ బల్కుదాన నెట ♦ కేగితివంచు వచించుదాన; దుః
ఖమ్మునుఁ గూర్చినావు కొడు ♦ కా! లవ! యేమని ధైర్యమూనుదున్.

హా! వత్సా!

చ. కనికరమన్న మాటవిడి ♦ క్ష్మాపతి యాగ్రహమూని నీపయిన్
ఘనవిశిఖంబు లేయుతఱిఁ ♦ గావవె! యంచును నీదుయగ్రజున్
మనమున నెట్లు బిల్చితివో ♦ మాతను నన్నటు జీరినాడవో
మునివరు వామలూరు సుతుఁ ♦ బ్రోవఁగరమ్మని యెట్లుబిల్చితో.

మునికు— తల్లీ! ఊరడిల్లుము. విచారించినందువలనఁ బ్రయోజనమేమి యున్నది.

సీత— హా! కుమారా!

మ. పతి పంపింప నరణ్యభూమి కిటు నా ♦ ప్రారబ్ధముం జేసి వ
చ్చితి; నెట్లో మిము జూచుకొంచు నిటు నా ♦ జీవంబులన్ నిల్పియుం
చితి దేహంబున; నింక నెవ్విధిని యీ ♦ చిత్తంబులో ధైర్యమూ
నితరన్ గాలము వెళ్ళదీయుదును తం ♦ డ్రీ! యెంతనిర్భాగ్యనో.

హా! లవకుమారా! నీ వియోగమునకు నేనెట్లు సహింతును! యిరువురు కొమారులను జూచుకొని దుఃఖమంతయు దిగమ్రింగి యుంటిని. తండ్రీ! ఇంక నే నెవ్వరినిఁ జూచుకొని సంతసింతును? ఇక నాకేమి

దిక్కు— నాయనా! నీ కింతలోనె నూరేండ్లు నిండినవా ! నీవు భగవంతుని కంటి కింత బరువై పోయితివా ?

కుశు—(ప్రవేశించి) ఏమి కారణమోగాని నాచిత్తము వ్యాకులమందుచున్నది. (పరికించి) ఏమిది! పర్ణశాల యిట్లున్నది.

సీ. పారంబులాపి తా ♦ పసకుమారు లదేమొ
వెఱ్ఱివారలరీతి ♦ వెలయుచుండి
తాపసోత్తములెల్ల ♦ దలలెత్త కుండంగ
జిత్తమందునఁ జింతఁ ♦ జేర్చియుండి
మునికన్య లేలొకో ♦ ననుఁజూచినంత నె
పల్కక యిందందు ♦ బాఱుచుండి
యనుదినం బెదురుగాఁ ♦ జనుదెంచు ననుగు ద
మ్ముఁడదేల నిపుడు గ ♦ న్బడకయుండె

తే. గీ. జనని మోముఁజూడ విచార ♦ జలధిలోన
మునిగిన విధంబు దోఁచెడి ♦ మనసదేమొ
చేయివెట్టి కలచినట్టు ♦ లాయె నిపుడు
కారణంబది యేమొకో ♦ కానరాదు.

మాతల్లి నడిగి తెలిసికొందుగాక. (తల్లిని సమీపించి) తల్లీ ! నీ మొగంబుజూడ నెందులకో దీర్ఘవిచారము బొందుచున్న విధము తోఁచుచున్నది. కారణం బెఱిగింపఁ గోరెద. నా యనుఁగుదమ్ముఁడయిన లవు డెక్కడ ?

సీత—పుత్రికా ! ఏమని చెప్పుదును ? (లవుని దలంచి) హా! లవకుమారా !

కుశు—అమ్మా ! ఏమది ! నా తమ్ముఁడేడి ?

సీత—ఇం కెక్కడ తమ్ముడు ?

కుశు—తల్లీ! అట్లు పలికెద వేమి? నాతమ్మున కేమి హాని వాటిల్లి నది? చెప్పుమా! నాచిత్త మారాట మందుచున్నది.

సీత—వత్సా! కుశా! నేడు నీ తమ్ముఁడు సమిత్కుశ ఫలాహరణార్థమై యరణ్యమున కరిగి యందందుఁ జరించుచుండ నచ్చటి కెవ్వరిదో మఖవాజి వచ్చినదట. దానిని నీ తమ్ముఁడు బట్టుకొని యొక వృక్షమునకుఁ గట్టివేసెనట. అంతట నొక రాజేంద్రుఁ డరుదెంచి వానితో ఘోరముగఁ బోరి నేలఁగూల్చి రథముపైఁ బెట్టుకొని పోవుచున్నాడట. అయ్యో! పుత్రికా! నే నేమి సేయుదును! ఇఁక నా కెవ్వరు దిక్కు. ఎవ్వరితో మొర వెట్టుకొందును.

కుశు—(లవునిఁ దలఁచి) హా! తమ్ముఁడా! మదీయ నయనచకోర శశాంకా!

చ. జనులు నుతింపఁగా మిగుల ♦ శౌర్యముజూపి దినేశు సత్కృపన్
ఘనమగు నస్త్రరాజములఁ ♦ గాంచిన నీదగు దర్పమెల్ల, నే
డని మొనవ్యర్థమయ్యెనె గ ♦ టా! యనుజా! లవ! యొక్కరాజు చే
తనె యిటుగూలినావె! మదిఁ ♦ దద్దయు దుఃఖము తల్లిఁ బొందగన్.

తమ్ముఁడా! ఎక్కడికైనను నాటలకుఁ బోయి వచ్చుట యాలస్యమైనచో నెక్కడ కేగెనో మనంబుల దిగులుబొంది నీకై యెదురు జూచుచుండు తల్లిని నేలబాసితివి. నిరంతరము నాకు ముదముగూర్చుచు నన్నాయని నోరార బిల్చుచు నేనొక్క నిముషము గనిపింపక యున్న నాకై యటు నిటు తారులాడుచుందువే! అయ్యో! నేడు నీయన్ననగు నన్నే విడనాడితివి: నన్నుగూడ నీవెంట దోడ్కొని యేల పోవైతివి. నేను నిన్ను విడిచి యొక నిముషమైన నుండగలనా! అనుజా! మన మిరువురమును తల్లి గర్భమున జనించితిమి. ఇరువురమును నొక కంచముననే దినుచుంటిమి. ఒక్క గురువు నొద్దనే విద్యల

నభ్యసించుచుంటిమి. అట్టియెడల నింతటినుంచి లవుని బాసి యీ కుశుం డొంటియై ప్రాణములతో నిలచునా? ఇంక నే నెవ్వరిని దమ్ముఁడా యని పిలుచుకొందును. ఎవ్వరితో నితఁడు మా తమ్ముఁడని చెప్పుకొందును. సర్వజన నయనానంద కరుఁడవు అతిశయ బలపరాక్రమ విరాజితుఁడవు. ప్రాచేత సకృపా సమార్జిత నిఖిలాస్త్ర విద్యా దురంధరుఁడవు. అట్టి నిన్ను బాసిన నాబ్రతుకు వ్యర్థము కాదా!

మునికు—మిత్రమా! కుశా! నీవును నీవిధమున నధైర్యమును బొంది చింతించు చున్నచో దుఃఖాబ్ధిని మునిగియున్న నీతల్లినోదార్చు వారెవరు! కర్తవ్యము విచారింపక యిట్లు చింతించుచున్నందు వలనఁ బ్రయోజన మేమి యున్నది?

కుశు—హితుఁడా! నీవు పలికిన మాట సత్యమే. (కోపముతో) ఓరీ! పరిపంథీ! మహాపరాక్రమోపేతుఁడవగు భూపాలుఁడవై యుండి, యొక బాలుని నీవిధంబున మ్రందించుటకు నీకుఁ జేతు లెట్లాడెను? ఛీ! నీవొక పౌరుషశాలివా!

మ. కదనంబందున నేను నా యనుజుపైఁ ♦ క్రౌర్యంబు జూపించి, క
ష్టదశంగూర్చిన నిన్నుగావగను నా ♦ శంభుండె యేతెంచినన్
వదలన్ బోవక చంపితీరెదను నే ♦ భద్రోక్రమోపేతునన్
గదియంజూడుము వచ్చుచుంటి నిదిగో ♦ కాలుండనా! దుర్మతీ.

ఓరీ! దురాత్మా.

తే. గీ. అనుజుపై నట్లు ఘోర శౌ ♦ ర్యంబుజూపి
నాజననికి వగపుగూర్చి ♦ నాడవు కద
చూచెదవుగాక యిపుడు కు ♦ సునిబలంబ
పుత్రవతియగుచు నీతల్లి ♦ పొగలకున్నె.

సీత—వత్సా! లవా!

ఉ. కాయలు బండ్లుదించు నిటు ♦ గానన భూమినినుండ లేక నీ
వాయెడ కేలబోయితి వ ♦ దేటికి నశ్వము బట్టినావు, క్షు
ద్రా! యవనీశ్వరుం డటు దు ♦ రాగ్రహ మూనఁగ నేల, న
య్యో యిక నెట్లు నీదగు వి ♦ యోగము సైతును బుత్రరత్నమా.

అయ్యో! తండ్రీ! పురాకృత ప్రారబ్ధము ననుసరించి యీ వనంబుల యందెట్లో తలదాచుకొని వాల్మీక మహామునీంద్రుని కృపచేఁ గాలము గడుపుచున్న మనకు సాహసకార్యములతో నేమి పనివచ్చెను. హా! కుమారా! సుగుణసదనా! విజితమదనా! లవా! ప్రాతఃకాలమున నే లేచి అమ్మా! యన్నము పెట్టుమని నాకాళ్ళ కడ్డమువచ్చు నిన్ను వారించు భాగ్యము నాకు లేదా! ఏమైనఁ గోపించు సమయమున "దల్లీ! ఆగ్రహింపకుము. తెలియక యీ నేరమొనర్చితి" నను నీ ముద్దుమాటల విను యానందముండదా! అమ్మా! నాకే ముందుగ నన్నము బెట్టుము. తరువాత నన్నకను నీ గారాబపు మాటలను విను ముదము లేదా! వనంబుల కరిగి క్రూరజంతువులను పెంపుడు కుక్కలుగా జేసి కట్టి తెచ్చి యాశ్రమముందు గట్టివేయు నీ సాహస చర్యల నింక జూడ నోచుకొనలేదా! హా! పట్టీ! నీ కేభగవంతుఁడును సడ్డుపడక పోయెనుగదా! నీతండ్రి ధర్మసంధతయైన నిన్ను గావలేకపోయెనా? దుర్భరశోకాబ్ధిని నన్ను ముంచి పోయితివా! ఇంక నే నెవ్వరి ముద్దుముచ్చటలఁ జూచి యానందింతును? ఎవ్వరికి సంపెగ తైలముతో దలదువ్వి సంతోషింతును. గురునియొద్ద బాఠములఁ జదువుకొని వచ్చు వేళ యైనదని నే నెవ్వరికొఱ కెదురుచూతును.

కుశ — తల్లీ! ఏల యీలీల ధైర్యమువిడిచి వాపోయెదవు.

సీత — నాయనా! కుశా! ఈ శోకము నెట్లు భరింతునోయి.

కుశ.

చ. కనులను నీరుగారఁ గొడు ♦ కాయని యొదుల కేడ్తువమ్మ; నీ
తనయుఁడు చావఁబోడిదియె ♦ తథ్యము, భీకరసంగరక్షితిన్
ఘనశ్రమఁబొంది యీవిధను ♦ నర్గ బడియుండగ నోపుఁగాని;యీ
మునిసుతు మాటపైన నగ ♦ పుర్గ వహించెద వెంతివెఱ్ఱివో.

అమ్మా! నాతమ్ముఁడు సామాన్యుఁడని తలంచుచుంటివా! అస్త్ర సంధాన చాతుర్యమున వానికి మించినవారీముజ్జగంబుల లేరని నొక్కి వక్కాణింతును.

తే. గీ. పగటియందున తారలు ♦ వరల లేవు
తరణి! తనగతి నొక్కింత ♦ తప్ప లేదు
అనిలమయ్యెదె వీచుట ♦ యాగ లేదు
అనుజుఁడేటికిఁ గూలును ♦ నాలమందు.

అమ్మా! ఈమాటలంతో నీకేఁ బ్రయోజనము లేదు. ఇటు వినుము.

మ. నను రక్షింపు మంటంచు వేడుకొనకు ♦ న్నాగ్, భీతిని బొందుచున్
రణరంగంబును వీడి వెన్నిడకయు ♦ న్నాగ్ రుమ్రిఁ డేకాక య
వ్వనజాక్షుండును బ్రహ్మయున్ గలిసి ద ♦ ర్పంబేర్చి యేతెంచినన్
జనపాలు లపునొర్చినట్టి కుమతిన్ ♦ జక్కాడి యేతెంచెదన్.

తల్లీ! నాముద్దుల తమ్ముని నొక ఘడియలో దెచ్చి నీచింతఁబాపెదను.

చ. మనసిజరూపచారు సుకు ♦ మార కుమారుడటంచు నెంచకే
మనమున గోపమేర్చి, యస ♦ మాన పరాక్రమ శాలియైన నా
యనుజునిగాసిఁ జేసిన దు ♦ రాత్ముని ప్రాణము దీసివత్తు, దీ
వెనలిడి దుఃఖమున్ విడిచి ♦ వేగమె పంపుము నీకు మ్రొక్కెదన్

సీత—నాయనా! లవుని విధ మట్లయినది. నీవు కూడ నా భూపాలునితో సమరంబునకుఁ గడంగెదవా?

కుశు—అమ్మా! నీవు నన్నుఁ గూర్చి భయమంద బనిలేదు.

సీత—కానిమ్ము.

ఉ. నా రమణుండు సద్గుణా గ ♦ ణాస్తవనీయ చరిత్రుఁడేని, నే
నే రమణీ శిరోమణిన ♦ యేని, మదీయ మనంబు నిశ్చలం
బై రహిం యుండునేని జగ ♦ మందున సాధ్వినినైతినేని, వ
త్సా! రణమందునన్ గెలుపు ♦ తథ్యము నీకును బోయి రమ్మికన్

కుమారా! చిరంజీవి యగు లవునితోఁ గూడ నీవు సత్వరముగ నరుదెంచుటకు సమస్త దేవతలు ననుగ్రహింతురు గాక.

కుశ—అమ్మా!

తే. గీ. హరిణమును జంపి చెండాడు ♦ వ్యాఘ్రమట్లు
శత్రువునిదాకి వధియించి ♦ సత్వరముగ
లవునితోడ నేతెంతు నా ♦ హ్లాద మొదవ
సంతసంబున నుండుము ♦ స్వాంతమందు.

సీత—నాయనా! శుభమగుగాక పోయిరమ్ము. నేనును పరమేశ్వరారాధనంబున నుండెదను.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





# శ్రీ
# కుశలవపట్టాభిషేకము.

పంచమాంకము.

[యజ్ఞశాల:—శ్రీరాముడు-భరతుఁడు-వసిష్ఠుఁడు
ప్రవేశించుచున్నారు].

శ్రీరా—తమ్ముఁడా! భరతా! తమ్ములగు మీరు చెప్పితిరనియు, సంగరమున రావణునిఁ జంపినందువలన నొదవు బ్రహ్మహత్యా పాతకము వాయుననియు, వసిష్ఠభగవానుని యాశీర్వచన బలం బుండుననియు, నీయశ్వమేధయాగము సేయఁ బ్రారంభించితిని. కాని, దీని కేవిఘ్నముఁగలుగకుండ నగునో లేదో యను సంశయము మాత్రము నామనంబున బాధించుచున్నది.

వసి—రామచంద్రా! భగవంతుఁడవగు నీవు తలపెట్టినది యన్యథా జరుగునా? ఇట్టియనుమానమును మనంబునుండి పారదోలుము.

భర—నీవేల యిట్టియనుమానమును పొందవలయును. ఏవిధమైన విఘ్నము లేకుండ జన్నము జరుగును. భూపతులయందు నింతకు ముందే కాయుచున్న నీ యశశ్చంద్రికలకు మఱింత కాంతి వచ్చును.

శ్రీరా—అకారణముగ నిందకు భయంబంది జానకి నరణ్యములకంపిన పాపము నన్నేవిధముగనైన బాధించితీరును. (ఇంచుక యూరకుండి) భరతా! భూచక్రము దిరుగ మనచేవిడువఁబడిన క్రతుతురంగ మింకను రాలేదేమి? మనశత్రుఘ్నుఁడు అశ్వముతో

బంధించిన వెుక మునితనయుని రణంబున మూర్ఛపుచ్చి వానిని రథముపైఁ బెట్టుకొని వచ్చుచున్నాడని వింటిమికదా ? అతని రాకగూడ నాలస్యమయినది. మునికుమారునితో రణంబున నలసియుండుటచే మార్గమధ్యమున నేమయిన నంతరాయములుకలిగిన సహాయముగ నుండునని లక్ష్మణునిఁగూడ బంపితిమి. వీరింతవరకును రాక దడయుటకు గారణము గోచరముగాకయున్నది.

సేవ—(ప్రవేశించి శ్రీరామునిఁజూచి) దేవా ! ద్వారముకడ రోజుకొనుచు బరుగెత్తుకొనివచ్చి మన జయంధరుఁడు దేవరవారి దర్శనము గోరుచున్నాఁడు.

శ్రీరా—ఏమీ ! జయంధరుఁడా ! అశ్వము వెంట బోయినవాడు. శీఘ్రముగ లోనికి రానిమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

జయంధరుఁడు—(తొందరగా ప్రవేశించి) దేవా ! రక్షింపుము. రక్షింపుము. (శ్రీరాముని పాదములపైఁ బడును.)

శ్రీరా—జయంధరా ! ఇట్లు రోజుకొనుచుఁ బరుగెత్తుకొనివచ్చి నా రక్షణము కోరుచుంటివేమి ?

జయం—ఇప్పుడు నీరక్షణమే కావలసియున్నది.

శ్రీరా—అట్లు పలుకుచుంటివేమి ! యజ్ఞాశ్వము వెంట నరుదెంచిన మాశత్రుఘ్నుఁడొక మునిబాలునితో ఘోరముగబోరి వానిని మూర్ఛిల్లఁజేసి రథముపైఁ బెట్టుకొని వచ్చుచున్నాడని వింటిమి. అతనికి సహాయముగ నుండుటకు లక్ష్మణునిగూడ బంపితిని. వారిరువురును నుండగా నీవేల యిట కరుదెంచి నారక్షణము గోరుచున్నావు. వారిరువురకును సేమమేకదా.

జయం—అట్లయిన చో నే నిచ్చటి కేలరావలసియుండును.

శ్రీరా—ఏమీ! నా తమ్ములు సేమముగ లేరా ?

జయం—దేవా ! ఏమి చెప్పుదును?

శ్రీరా—హా ! తమ్ములారా !

భర—జయంధరా ! అక్కడ వార్తలు పూర్తిగ జెప్పక రెండు పొడి వాక్యములచే మాచిత్తముల కారాటము గలిగించుచుంటి వేల? సవనహాయము రాక తడయుటకుఁ గారణ మేమి ! లక్ష్మణ శత్రుఘ్ను లేమయిరి. సవిస్తరంబుగఁ జెప్పుము.

జయం—మునిబాలుని మన శత్రుఘ్నుఁడు మూర్ఛపుచ్చి రథముపై బెట్టుకొని వచ్చుచుండె ననుసంగతి మీరు విని యే యుండిరి. అవతలి వృత్తాంత మాలింపుఁడు. అట్లు శత్రుఘ్నుఁడు ముని బాలుని నిజస్యందనముపైఁ బెట్టుకొని వచ్చుచుండగా మెఱపు మెఱసినకరణి త్రిపురసంహారము సేయఁబోవు ఫాలాక్షుని చందమున నెక్కడనుండి రొకో మూర్ఛమునింగియున్న మునితన యున కగ్రజుఁడట కడురయంబున నరుదెంచి రథమున కడ్డముగ నిలిచి "ఓయీ శాత్రవగర్వాపహార సమర్థుండనగు నాయనుజునిఁ బసిపాలుని ఘోరరణంబున మూర్ఛిల్లఁజేసి రథముపై బెట్టుకొని పోవుచున్న నీవును నొకశూరుడ వేనా ! ఇదిగో ! అతని యగ్రజుండనగు నేను వచ్చినాడను. వంటుఱిల్లు గుండేలు వచ్చిన చందమున నీవు నాకంటఁబడితివి. ఇంక నెందుబోగలవు. బ్రహ్మేంద్రాది దిక్పాలకులతో నిన్ను గాచుటకు శంకరుఁడు వచ్చినను విడువక నీగర్వభూజమును నేడు సమూలముగా బెల్లగించివైచెద" నని మేఘ గంభీర భాషణంబులఁ బలుకుచు దొడ్డనారసంబుల రెంటిని దొడిగి విడిచి రథాశ్వములను ముందుఁగూల్చి; మరల కరముల శరముల సంధించి "ఓయీ!

రమ్ము. పౌరుషమున్నవాడవేని నిజమైన క్షత్రియుడవేని కదనంబున నిలువు" మని పలికెను.

శ్రీరా—భరతా ! ఏమిది ! మునిబాలకుఁడేమి ? ఇట్టిశౌర్య ధైర్య పరాక్రమ విరాజితుఁడై యుండుటేమి ? ఇట్టివింత మున్నెప్పుడును జూచియెఱుంగము. జయంధరా ! తరువాత?

జయం—తరువాత. ఓదేవా ! శత్రుఘ్నుఁడు మునిబాలుని వాక్యములకును వీర కృత్యమునకు వెఱగంది యొక్కింత కాలమూగి క్రమ్మర ధైర్యమునవలంబించి క్రోధరసాదిదేవత మూర్తీభవించినదో యనునొప్పుచు మునిబాలునిపై శరవర్షము విరామము లేకుండ గురిపించెను.

శ్రీరా—(సంతోషముతో) సంగరమున లవుని మునిమి యశము గాంచిన శత్రుఘ్నుని ముందు బ్రాహ్మణుల శౌర్యము పనికివచ్చెనా ? తరువాత?

జయం—శత్రుఘ్నునిచేఁ బ్రయోగింపఁబడు ప్రతిశరమును మునిబాలుఁడు తన కరలాఘవంబున ఖండించుచు శత్రుఘ్నుని విలోకించి ఓయీ ! పరిపంథి ! నిన్ను నిముష కాలములో యమసదనంబునకుఁ బంపదగినశక్తి నాయొద్దనుండియు నీ శరలాఘవ కరలాఘవమును బరీక్షింపఁ గుతూహలాయత్తచిత్తుఁడనై యింతవఱకు దాళితిని. ఇంకఁ గాలహరణమునకు నాచిత్తము సమ్మతింపదు. ముక్కుపచ్చలారని ముద్దుకుఱ్ఱను రణమున నిర్జించి పోటు మానిసినని గర్వించు నీకు నే నిప్పుడే శిక్ష సేయుచున్నానని పలికి యొక్క యమోఘమయిన శక్తిని చేతబూని" "మాజనని నిజమైన వీరమాతయు లోకారాధ్యయగు సాధ్వియునగునేని ఈశక్తిచే శాత్రవుఁడు నూలుగాక" యని పలికి సమంత్రపూర్వకముగ విడిచెను. స్వామీ ? ఏమిచెప్పుదును.

మునికుమారుని చేతినుండి వెలువడిన యాశక్తి సర్వజగత్ప్రళయము సంభవింపఁజేయునా యని భయంబుదోప నగ్నిజ్వాలలు గ్రక్కుచుఁ గడురయంబున శత్రుఘ్నునిదాకి నేలఁగూల్చెను.

శ్రీరా—హా! తమ్ముఁడా! శత్రుఘ్నా!

మ. బవరంబందున శాత్రవుల్ బెదర ద ♦ ర్ప ప్రాభవం బేర్చి, యా
లవణున్ గూల్చి, మునీంద్రసంతతికి నా ♦ హ్లాదంబు గల్పించి, యు
త్సవముల్ గొల్చిన మేటిశూరుఁడవు నీ ♦ దర్పంబు బోనాడి, నే
డవురా! బాలకుచేతిలోఁ బడితివా ♦ హా! తమ్ముఁడా! ధీనిధీ.

అక్కటా! కుంజరయూథము దోమకుత్తుకఁజొచ్చిన విధమయ్యెనే. హా! అనుజా! మదాజ్ఞా విధేయా! కౌసల్యకు సుతుండొక్కఁడు. కైకకు నొక్కఁడే. సుమిత్రకిరువురముంటిమి. ఇది పొసగదని తలంచి నన్నువిడనాడి పోయితివా!

తే. గీ. నీవె దైవంబ వంచును మదిలోన ♦ నెంచియున్న
యువిదశ్రుతకీర్తి కేమని ♦ నుడువువాడ
యజ్ఞహయము నిమిత్తంబు ♦ ననుజుఁబంపి
పుడమిఁగూల్చితి నంచును ♦ నుడువఁగలనె

అక్కటా! సమానాశ్వరక్షకునిగా నిన్నేల యేర్పఱచితిని. నీకుఁ గీడు వాటిల్లఁ జేయుటకే యీక్రతువారంభించితిని కాబోలు!

భర—అన్నయ్యా! చిత్తమున నధైర్యమునకు చోటీయవలదు. వీరాగ్రేసరుఁడగు మన శత్రుఘ్నునియేమి! మునిబాలుఁడు గూల్చుటేమి! అతఁడు మూర్ఛమునింగియుండును గాని మఱియొండు విధమని చింతింపవలదు. జయంధరా! తరువాత వృత్తాంతము వినిపింపుము.

శ్రీరా—జయంధరా! ఆ సమయంబున మా సౌమిత్రి యచ్చటలేఁడా!

జయం—దేవా! శత్రుఘ్నుఁడు నేలఁబడిన యొక ఘడియకు లక్ష్మణుం

డమ్మోడ కరుగెంచి మునిబాలుని శక్తిచే నేలఁదొఱగియున్న శత్రుఘ్నుని విలోకించి దుఃఖించి క్షత్రియునకు సమరరంగమున విచారించుట ధర్మముగాదని తలంచి ధైర్య మవలంబించి దండధరునిచందంబున మండిపడుచు మునిబాలుని నవలోకించి "నీయెడల బాలుఁడవని కృపవహింపరాదు. నేడు నీతల్లి యపుత్రవతి యగుఁగాక!" యని పలికి వివిధ నారాచపరంపర లామునిబాలునిపైఁ గప్పెను.

శ్రీరా—లక్ష్మణుడు శరఖడ్గంబుల దాల్చి రణరంగమున నిల్చెనేని యతనిని ఘాలాత్ముడైన నోర్వఁగలఁడా? తరువాత?

జయం—మునిబాలుండును నొక్కింతయేని చలింపక తీవ్రశరంబుల చేతనే లక్ష్మణునకు బ్రత్యుత్తర మిచ్చుచుండెను. ఇట్లిరువురును నతిఘోరముగ బోరుచుండు నవసరమున శత్రుఘ్నుని రథముపై మూర్ఛిల్లిన మునిబాలుఁడు నిద్రలేచిన వానిపోల్కి మూర్ఛనుండి లేచి యగ్రజుని పజ్జను నిలచుండెను.

శ్రీరా—మూర్ఛమునింగిన మునిబాలుఁడు లేచెనా!

జయం—తాను మూర్ఛనుండ లేచినందుల కానందమును బొందుచున్న యన్నను దమ్ముడు విలోకించి "అన్నయ్యా! మన మిరువురమును నీ రిపుసైన్యములను బేరులేకుండఁజేయుద"మని పలికి మనసైన్యములపైఁబడి గోజీయులమందను దోలు గోపాలకులకైవడి నలుదెసలఁ బరుగులిడఁ జేసిరి.

శ్రీరా—అబ్బా! మునికుమారుల శౌర్య మత్యద్భుతము గొలుపుచున్నదే. వారెవ్వరో యశ్వసీ కుమారులకుఁ దుల్యులని తోచుచున్నది. పఱుగిడుచున్న సైన్యములను జూచి లక్ష్మణుఁ డూరకొనెనా?

జయం—ఏలయూరకొనును. మునిబాలుర తీవ్రశరాగ్నికి సహింపలేక

పరుగిడుచున్న మనబలంబుల నవలోకించి ఏల యీలీల ముని బాలురకు భీతిల్లి రణభూమినుండి తొలఁగెదరు. గాలిలోఁబెట్టిన దీపములవలె యీతనువు లెప్పటికైనను రాలునవే. ప్రాణ భీతిచే నిట్లు బాఱిన మిమ్ము జగములు హాసించును. పిఱికివా రంమరు. దుర్యశ మొనర్పును. రండు ధైర్య మవలంబింపుఁడు. నీవా నేనా యని పోరాడుడు అని పలికెను. లక్ష్మణుని మాట లకు బలంబులు గ్రమ్మరధైర్యముబూని రణభూమింబ్రవేశించెను.

భర—తరువాత?

జయం—అట్లు సైన్యంబును మరలించి మన సుమిత్రాసూతి మునికు మారులంగవిసి యెడతెరపిలేకుండ వేడినారసంబులఁ బ్రయో గించి వారిని దీనదశకుఁ దెచ్చుచుండె.

శ్రీరా—లక్ష్మణకోప్రధానలంబునకు శలభంబు లగుటకే వీరిట్టి కృత్య ములు సేయుచున్నారు. జయంధరా! చెప్పుము. చెప్పుము.

జయం—లక్ష్మణునిచే నిట్లు దీనదశకువచ్చిన యాంతాపసతనయులు గోరలు పెరికిన త్రాచులవలె కొంతవడికు రణం బాపి ఆకస మువంకఁ జూచుచు బ్రభాకరుని ధ్యానింప నమ్మహోసీయుఁడు ప్రసన్నుఁడై వారి కమోఘంబులగు శరంబు లొసంగి యంత ర్థానుఁడయ్యెను.

శ్రీరా—ప్రభాకరా! నీకు మాయందింత వాత్సల్యము లేకపోయినదా!

తే. గీ. రవికులంబున జన్మించె ♦ రాముఁ డీత
డతని మఖవాజిబట్టిన ♦ యరులువీర
లనుచు దలపకే మము గూల్ప ♦ నకట మాని
తనయుల శరము లిత్తువే ♦ దయనుమాలి.

ఇయ్యది నీకు ధర్మమా! కులాభిమాన ముండవలదా! వృద్ధుఁడవే వృద్ధునకు లక్షణమిట్టిదేనా?

భర—అన్నయ్యా! రవి మునితనయులకు శరంబు లిచ్చిననేమి? ఈయకున్న నేమి? లక్ష్మణుని ముందీశరము లేమియుఁబని సేయఁజాలవు.

జయంధరా! తరువాత చెప్పుము.

జయం—ప్రభాకరానుగ్రహమున వడసిన యాశరములు కరంబులఁ బూని మునికుమారులు ఎవ్వరికిని దేరి చూడశక్యముగాక మనబలంబులపైఁబడి వీర విక్రమ విహారంబునకుఁ గడంగిరి. అయ్యా! ఆ సమయమున మన బలముల యవస్థ యేమని చెప్పుదును. "బ్రదికియుండిన బలుసుకూరనైనఁ దినవచ్చును. ప్రాణముల బోగొట్టుకొననేల. వీరు సామాన్య మునికుమారులు గారు. మనపాలిటికిఁ గాలస్వరూపమున వచ్చిన" వారని యొకరి తోనొకరు చెప్పుకొనుచు సమరతలము విడిచి కాల్కొలది బరుగెత్తగడంగిరి.

శ్రీరా—అవురా! ఇరువురు కుమారు లంతలో బ్రాహ్మణులు మన సైన్యముల కెట్టిస్థితి గూర్చిరి. అప్పుడు లక్ష్మణుం డేమిసేయుచుండెను.

జయం—పఱుగిడుచున్న బలంబులను బురికొల్పుట కెన్నియో ప్రయత్నములు చేసెను గాని లాభములేకపోయెను. ఇఁక నాబలంబుల వలనఁ బ్రయోజనము లేదని తలంచి మన సౌమిత్రి నయనంబుల నుండి క్రోధాంగారక కణంబుల రాల్చుచు నక్కుమారులను దాకి యమోఘమైన శరములను పేరుపేరు వరుసను జెప్పుచు బ్రయోగింపఁ గడంగెను.

శ్రీరా—బాగు. బాగు.

జయం—దేవా! లక్ష్మణునిచేఁ బ్రయోగింపఁబడుచున్న శరములలో నొక్కదానికైన నాకుమారులు భయమందక "ఓయీ! ఇంత కుమును యుద్ధముజేసిన నీతమ్మునికంటె నీవు పరాక్రమవంతు

డవు. శౌర్యశాలివి. అస్త్రసంధాన చాతుర్యము గలవాడవు. ఆ కారణముచేతనే మాయెదుట నింతవఱకును నిలువగలిగితివి. ఇదిగో ఇక జూడు మని పలికి యాగ్నేయాస్త్రము నొండు తొడిగి యిది తప్పకనిన్ను నేలగూల్చుగాక" యనుచు బ్రయోగించిరి. దానితో లక్ష్మణుండు రథముపై నట్టె మేనువాల్చెను. సైన్యము విచ్చి యంతకుముందే పలాయితమైనది. నేనుమాత్రి మీవార్త వినిపించుటకు బ్రతికివచ్చితిని.

శ్రీరా—హా! తమ్ముఁడా! నీవుగూడ శత్రుఘ్నునిఁ జేరఁబోయితివా?

మ. అమరశ్రేణిముదంబునందగ నము ♦ ద్యద్దర్ప మేపారగా
సమరంబందున మేఘనాథునివెసన్ ♦ జక్కాడి, నల్దిక్కులన్
విమలంబౌ యశమందినట్టి నిను బ్ర ♦ ధ్వీదేవులేగూల్చిరే.
యమితాశ్చర్యము దోచుచున్నదికదా ♦ హా తమ్ముడా! లక్ష్మణా.

సీ. భక్తి నాపైఁ బూని ♦ భాగ్యసంతతివీడి
వనులకు నా వెంట ♦ వచ్చినావు
పదునాలుగేండ్లును ♦ బడరానియిడుమ
జెందుచు నా సేవఁ ♦ జేసినావు
దైవంబుగా నన్ను ♦ భావించి మదిలోన
యంచితమైత్రి మ ♦ ర్తించినావు
శిరముపై నాయాజ్ఞ ♦ నిరతంబుధరియించి
బంటుగా నాముందు ♦ బరగినావు

తే. గీ. కటకటా లక్ష్మణా నిన్నుఁ ♦ గరుణవిడిచి
నవనమును పేరు గల్పించి ♦ చంపుకొంటి
నెంతపాప కర్ముడనో నే ♦ నింక నెట్లు
బ్రతుకగలవాడ నినువీడి ♦ వరగుణాఢ్య.

మ. వనవాసం బటుతీరినంతనె నిన్నున్ ♦ భార్యాసమేతంబుగా
గని సంతోషమును బొందె నీతాజనని ల ♦ క్ష్మణాహ; యీకేకకు నీ

వనిలో గూలిన వార్త నే కరణీవం ♦ బట జే వాకుస్రిత్తు నో
యనుజా! ఎంతటికిచింతనూ ప్చితివిరా ♦ హా! బాసితే నన్నునుట.

భర—అన్నయ్యా! సామాన్యమానవుని లీలనిట్లు జింతించెద వేల?

శ్రీరా—భరతా! అట్టితమ్ముడు నాకుఁబది వేలవర్షములు తపంబాచరించినను దొరుకునా?

భర—తే. గీ. మునికుమారుల పైనన ♦ మోఘ శరము
వేయుటం జేసి సౌమిత్రి ♦ యెట్లొ మూర్ఛ
నందియుండును గాక ఘో ♦ రాజియందు
శంభుడైన నతని గెల్వ ♦ శక్తుఁడగునె.

ఒక్కసారి రణరంగమున దీవ్రముగ గన్నులు తెఱచి చూచెనేని రిపులు భస్మమగుదురు. అట్టివో మునిబాలకులు సౌమిత్రిని గూల్చిరనుట నమ్మదగిన విషయముకాదు.

వసి—రామా! నీవు విచారింపకుము. భరతుఁడు చెప్పినట్లే యైయుండనోపును.

శ్రీరా—హా! తమ్ముడా! ఊర్మిళామనోహరా! ఒక్కనిముషమైనను నన్నెడబాయక నిరంతరము నన్ను సేవించుచు నీ వలరారుచుండుటం జేసి మనలనిరువురను రామలక్ష్మణులని లోకము జెప్పుకొనుచుండెను. అయ్యో! నీవులేని యీ రాముఁడింక నెట్లు నిలువగలఁడు. అరణ్యములకు నేను బోవునప్పుడు నన్నెడబాయజాలక వెంటవచ్చిన నీవు నన్నిప్పు డెడబాయుట కేల సమ్మతించితివి. నన్నుగూడ నీ వెంటదోడ్కొనిపొమ్ము. నిన్ను విడిచి నేను జీవింపఁ జాలను.

భర—అగ్రజా! ఊరడిల్లుము.

ఉ. ఆపదవేళ నాస్తికున ♦ కైన భవత్పదదివ్యసేవయే
యాపదదాట జేసి ముద ♦ మందగ జేయును గాదె యట్టిచో

నీ పగిదిఁ విచారమును ♦ నేలవహించెదవయ్యా నీవు, దే
వా! పరమేశుఁడైనను భ ♦ వన్మహిమంబు నెఱుంగశక్తుఁడే.

శ్రీరా—లక్ష్మణా! ఇంక నేను నిన్నీజన్మమునఁ జూడఁజాలనా? లక్ష్మణ శత్రుఘ్నులారా! మీ రిరువురును నాభుజములు పడవేసి ... రా. లక్ష్మణా! నాతోఁ గూడ నరణ్యములకరుదెంచిన నీప్రేమ నిద్రాహారములు మాని యరణ్యమున నన్ను సేవించిన భక్తి జనకరాజనందన వియోగార్తినిని గుందునప్పుడు నాకు ...ము జెప్పుచు గంటికి రెప్పవలె ననుగాచిన నీగాఢాను రాగము. హా! తమ్ముఁడా? ఎట్లుమఱచిజీవింతునురా?

వసి—రామా! విచారింపకుము. సుమిత్రా సూనులుమూర్ఛయందే మునింగియుందురు

భర—అగ్రజా! నీవే యిట్లు శోకాబ్ధిమునిగిన మాబోంట్లను గూర్చి చెప్పవలయునా?

శ్రీరా—గురువర్యా! వసిష్ఠా! నా చిత్తమున నెట్లు ధైర్యము నిలుపుదును. అక్కటా! ఈ పాడుయజ్ఞము నెందులకు జేయదలఁచితినో కదా! తమ్ములనిరువురను నామునికుమారుల పొట్టకుఁ బెట్టి యింక నెట్లు మేనజీవంబుల భరింతును. హా! తమ్ముఁడా! నిండుగర్భిణి అనసూయారుంధతీ వినుతపావనప్రశస్తగుణశీలను అగ్నిభట్టారకునిచే దనపాతివ్రత్యమును గూర్చి సాక్ష్యమిప్పించిన లోకైక సాధ్వీతిలకమును నరణ్యమున డించివచ్చినపిమ్మట నామె యచ్చట దీనదశంబొంది యాగ్రహంబున నీకేదియైన శాపమిచ్చినచో నీవు దేహమువిడిచి యుండవలయుగాని, లేకున్నచో రణంబున నిన్ను మునికుమారులు గూల్పఁగలరా?

(సీతనుద్దేశించి.)

తే. గీ. కలదె యపరాధమింత ల ♦ క్ష్మణుసపలస
నేవచింపగ గానలో ♦ నిన్ను విడిచె

నాగ్రహించిటుబూనఁగా ♦ నగునె నీకు
వనికిఁబంపిన నన్ జంప ♦ వలయునీవు.

ఓమాతా! సుమిత్రాదేవీ!

చ. సవనము పేరుబెట్టి యను ♦ జన్ములఁజంపెను వీఁడు పాపసం
భవుఁడని తిట్టకుండ నిక ♦ భ్రాతలదారిని పోదుగాన, నే
నవనిని గూలుటన్ విని ము ♦ దంబ విచారము నందకుండ నీ
వవిరళధైర్యమున్ గొలుపు ♦ మామెకు నీవును నేడ్వకుండఁగన్.

భర—అన్నయ్యా! జ్ఞాన సంపన్నుఁడవగు నీవిట్లు విచారమందుచుంటి
వేమి? లక్ష్మణ శత్రుఘ్నులేమి మునిబాలకులచే నీల్గుటేమి?

చ. సరగున నేగి నే నిపుడె ♦ శౌర్యపరాక్రమ విక్రమంబునన్
దురమున మౌనిబాలకుల ♦ దున్మించి; తదీయశిరంబులన్ ముదం
బరయఁగఁ దెచ్చి నీసముఖ ♦ మందునఁ బెట్టెద దప్పకుండ, నా
వరబలశౌర్యముల్ గని సుపర్వులు మెచ్చఁగ రాఘవాగ్రణీ.

శత్రు—ఇట్టియాస మనకేల? జయలక్ష్మికిని మనకును దూరమైనది.

చ. ఘనరణరంగమందు బల ♦ గంబు సమస్తము పోయెనయ్యయో
యనుజులు నేలపైఁ బడిరి ♦ నామునిపుత్రులచేతఁ గష్టపుం
దినములువచ్చె నేమనుదు ♦ ధీరతయెట్టులునిల్చు; తమ్ముఁడా
జనకజ వెంటనే యరిగె ♦ సౌఖ్యములన్నియు నిశ్చయంబుగన్.

తే. గీ. మనుకులం బింతతోడ స ♦ మాప్తిఁ బొంద
కుండ నీవైన జయించి ♦ యుండి చనిన
వారి కిన్ని జలంబులు ♦ వదలుమయ్య
యనుజ వేగిన దారి నే ♦ నరుగుదింక.

భర—అగ్రజా! ఈ వెఱ్ఱితలంపేమి నీమాటలకు నేనుత్తరు చెప్పవలసి
నవాఁడనుగాను. కాని సమయమట్టిదగుటచే తప్పదయ్యెను.

మ. కలవక సర్వరిపుప్రకాండ జయముల్ ♦ గైకొన్నచో సద్యశః
కలనం బెందఁగవచ్చు వైరిజన సం ♦ ఘాతంబు చేకూలినన్
బల భిల్లోక నివాస సౌఖ్యము వహిం ♦ పఁగ వచ్చు నీ రెంటికిన్
వెలియైపోయెడు వెంగలుల్ గలరె పృ ♦ థ్వీనాథ చూడామణీ

ఏవిధముగనైన సద్గతిని జూచుకొనవయును గదా. ఆత్మహత్య జేసికొనుట వలనఁ బ్రయోజనమేమియున్నది? దానివలన మఱింతపాపమే. యాగము సేయుటవలన సద్గతికలుగును. యాగముపూర్తియగుటకు హాయము వచ్చితీరవలయును. మనము రిపువధకుఁ గడంగకయుంటిమేని యశ్వము రాదు. ముందు మనము శత్రుసంహారణోద్యోగమును వహింతము.

వసి—ముందు చేయవలసి పనియదియే.

శ్రీరా—నిజము తమ్ముడా. (కోపముతో) ఓరీ ! మునిబాలకులారా

తే. గీ. తమ్ములను పరాక్రమ శౌర్య ధనుల నాజి
గూల్చి శాంతుండనౌ నాకుఁ ♦ గోప మడర
జేసి యేమూల కేఁగ మీరు ♦ చేరగలరు
నాదు ఘోర క్రోధాగ్ని కిం ♦ ధనులు గాక.

భరతా ! సుగుణరతా !

చ. అనుజులనిర్వారన్ రణము ♦ నందున గూలగ నేసినట్టి యా
మునిసుతులన్ గృపఁగ విడిచి ♦ భూరిపరాక్రమ మేర్చిచంపి యా
ఘనరుధిర ప్రవాహమున ♦ గాంక్షనుస్నాన మొనర్తుగాన నా
సునిశిత ఖడ్గమున్ ధనువు ♦ సొంపుగ నీయుము వేగదమ్ముడా?

భర—(బాణములిచ్చును)

శ్రీరా—(పుచ్చుకొని) సేవకా! నివరిగి సారథితో రథమును సిద్ధము! సేయుమని చెప్పుము. మేముగూడ వచ్చుచున్నాము. గురువర్యా! సెలవా ?

వసి—మీకు శుభమగుగాక. (అందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.





శ్రీ

# కుశలవ పట్టాభిషేకము

## షష్ఠాంకము.

రంగము. [వనము:—సవనాశ్వముతోఁ గుశలవులు అస్త్ర శస్త్ర పాణులై శ్రీరామ భరతులు ప్రవేశించుచున్నారు.]

శ్రీరా—తమ్ముఁడా! భరతా! అటుజూడుము. అదియే మన క్రతు తురంగము. అదిగో! దానిని చెట్టునకు గట్టి నిలఁబడియున్న వారే మునిబాలకులు కాఁబోలు. నేను గూడ వారితో సంభాషింపనేల. ముందు నీవరిగి వారియుదంతమరసి సామము మీఁద కార్యము సాగునట్లు జూడుము. మునికుమారులకు యుద్ధము గూడదని బోధింపుము. వారు నీ సద్వాక్యముల విన్నచో మంచిదే. లేదా సమరము తప్పదు.

భర—అగ్రజా! ఆజ్ఞ సిర్వహించుచున్నాను. (ముందుకు నడచును)

లవ—అన్నయ్యా! ఆ వచ్చిన యిరువురు మనచే రణంబున బడిన వారికి సోదరులవలెనున్నారు.

చ. అని మొన విమ్ములాగి తేసి ♦ సంతకుపట్టికి బోవజూచి న
మ్మనముల జంతబొందియున ♦ మాన కృపాంసముంటచేత న
య్యనుజుఁ గూడి పోవఁగ గ ♦ దా! యిటువచ్చిర శ్రీరలీక భం
జనమన నేర శౌర్యము గ ♦ నన్ వలె నెవ్వడు శ్రీరశేఖరా.

కుశ—తమ్ముఁడా! గతించిన యనుజులమీఁద వీరికి బ్రేమయున్నట్లు వీరిరాకయే తెలుపుచున్నది. కానిమ్ము. వీరికిగూడ మనబాణముల చవిఁజూపింతము. (భరతునిజూచి)

చ. సమరమునందు శాత్రవులు ♦ చచ్చుట జూచియు వచ్చితేల; వీ
రమితపరాక్రమైక ధను ♦ లంచు నొకింత యెఱుంగకుండు వే
భ్రమగొని యగ్నిపైనఁబడి ♦ ప్రాణము వాసెడి పుర్వువోదు వే
విమలమతిన్ వచించెదను ♦ వేగము పొమ్మిక యుద్ధమేటికిన్.

భర—ఓరీ! ఆత్మశ్లాఘాపరాయణా!

ఉ. చాలునుజాలు మూయుమిక ♦ జక్కఁగనీదగునోరు; నిట్టి వా
చాలతతోఁ బనేమి; కడు ♦ శౌర్యమునన్ విలసిల్లునట్టి భూ
పాలురతోఁడ నీవిధిని ♦ బంతములాడుచునుంటి వోర; నీ
వాలమునందు నొక్కతృణ ♦ మైనఁ గదల్పగ నోపువాడవే.

కుశ—ఓరీ వైరీ! నే నాత్మశ్లాఘా పరాయణుఁడనా? నోరుమూయ వలయునా? భూపాలురతో బంతము లాడలేమా? ఆలమున దృణమైన గదల్పలేమా? నీవు మహాపరాక్రమ వంతుడవు కాబోలు! పదీ! చూతము! రణరంగమున కవతరింపుము.

లవ—ఓయీ! మాటలతో నేమి ప్రయోజనమున్నది. యుద్ధము సేయ గల్గిన వాడెవ్వఁడును నిట్టి ప్రగల్భములాడఁడు. వృధగా గాలహరణ మొనర్పక శక్తిగలిగిన వాఁడవైనచో యుద్ధమునకు దిగుము. లేనిచో శరణుబొందితివేని రక్షింపుమని వేఁడుము. అభయమిచ్చెదను.

భర—(తనలో) వీరి శౌర్య వాక్యములఁజూచిన నాకాగ్రహ మొదవుచున్నది. ముఖలక్షణములఁ జూచిన జాలికలుగుచున్నది. ఇట్టి సుకుమార శరీరులపై శరముల నెట్లు ప్రయోగింపగలను. నెమ్మదిగా వీరిని సమర పరాఙ్ముఖులనుగా జేయజూచెదను

(ప్రకాశముగా)

ఉ. తాపసబాలురైన మిము ! దాకఁగ జేతులు రావు నాకు, మీ
రాపఁగ శక్తులౌదురె, ధ ♦ రాధిప శౌర్యమహాగ్నికీల, సం
తాపమునొందు మీకొఱకు ♦ దల్లి యనింబడి శేసి, పట్టి యా
లాపములాడకుండ జను ♦ డా మునియాశ్రమ వాటి జేరఁగన్.

యుద్ధమున మీ రీల్గితిరేని మీతల్లికింక గనిపించదు. ఆమె మీకై యెంతయో చింతించును. కుమారులారా ! మిమ్ముఁ జూచిన నది యేమి కారణమో యంతరంగమున గరుణ జనించుచున్నది.

లవ—ఏమయ్యా ! క్షత్రియవీరులకు ధర్మముగాని వాక్యములఁ బలుకుచుంటివి. యుద్ధము సేయుటకు నీకు శక్తి లేదా యేమి. భయమంది యిట్టి వాక్యములు పలుకుచుంటివా ! అట్లయిన భయపడితినని చెప్పుము. భయమందిన వారితో మేము రణము సేయుము.

భర—మునిపుత్త్రులారా ! ఎంతమాట పలికితిరి. రణమునకు నేను భీతిల్లితినని తలంచుచుంటిరా. బాలులగు మిమ్ము జంపుటకు జేతులు రాక యిట్లుపలికితిని.

లవ—

ఉ. బాలురు వీరటంచు నను ♦ మానము బొందగ బోకుమయ్య, యా
భీలపరాక్రమక్రమము ♦ భీకరసంగరమందు జూడనౌ
బాలులమౌదుమో రిపుల ♦ పాలిటి కాలులమౌదుమో ధరా
పాలక నీవ చూచెదవు ♦ మాటలతో బనియేమి చెప్పుమా.

కుశ—ఏమంటివి. మేము రణమున నీల్గితిమేని మాతల్లి దుఃఖించు ననియా ! రణమున నీల్గినచో దుఃఖించదు. రణమున వైరిని గెలువకుండ గృహమునకు పోయితిమేని యిట్టి పిఱికిపందలు నాగర్భమున నేల జనించిరని చింతించును. అందుచేత రణం

బున నిన్నోర్చి విజయలక్ష్మీ లాలితులమై మాతల్లిని వీరమా
తగ జేసి సంతోషము గూర్చెదము.

శ్రీరా—(లేచి తనలో) ఔరా! ఏమి? ఈబాలుర ధైర్యవచన
ములు శౌర్యఘనుఁడగు భరతునిఁ దృణీకరించుచున్నారు.

భర—(కుశలవులను జూచి)

చ. మనసిజరూపచారు సుకు ♦ మారకుమారుల మిమ్ముఁజూచినన్
మనమున బ్రీతిబుట్టి యిటు ♦ పల్కుచునుంటినిగాని; మిమ్మునే
నని మొనదాక భీతిపడి ♦ యించు దలంపఁగ జెల్లునే, యిఁకా
గనుడు; మదీయ విక్రమము ♦ కాలుని ప్రోలికి మిమ్ము జేర్చెదన్.

శ్రీరా—(కుశలవులను సమీపించి) బాలకులారా!

మ. జనకుం డెవ్వరు తల్లిపేరెవరు యీ ♦ చందంబునన్ ఘోరకా
ననమందుండగనేల! మిమ్ము నిచటన్ వర్జించి యుండంగ నె
మ్మనమందున్ దలిదండ్రు లోర్చి రెటు, లే ♦ మౌనీంద్రు ప్రార్థించి వి
ద్యను గైకొంటిరి చెప్పుడీ యిపుడు మో ♦ దంబయ్యె నాకున్ వినన్.

**కుశ**—ఓయీ! రాజా!

చ పలుకుల గొన్నిటన్ బలికి ♦ భండనభూమి దొలంగిపోయియే
వడువునె మీదు యశ్వమును ♦ బట్టుకొనంగ దలంచుచుండిరే
నలదిక మాటలన్ బలుక ♦ బట్టినయశ్వము వీడబోవు; మీ
కలితపరాక్రమ క్రమము ♦ గాంచెద మిప్పుడు జూపు డీవెసన్
మాటలచేత మమ్ము దప్పించుకొని పోవుటకు జూడవలదు.

శ్రీరా—తమ్ముఁడా! భరతా!

చ. వనములనుండి యెప్డు భగ ♦ వంతుని గొల్చుచు నుండునట్టి స
న్మౌని సుతు లీవిధంబునను ♦ భూరిపరాక్రమ విక్రమంబులన్
గనఁబడ జేయు టెప్పుడును ♦ గాంచియెఱుంగను; వీరిచర్య నా
మనమున కద్భుతంబగుచు ♦ మానక తోఁచెను కైకనందనా.

తే. గీ. వేషములు జూడ భూసురుల్ ♦ వేడ్క గొలుపు.
మాటలను జూడ రాజకు ♦ మారవరులు
గాగ దోచుచున్నది మదిఁ ♦ గాకయున్న
మౌనిపుత్రుల కింతటి మహిమకలదె.

మీరెవ్వరైనను సహాయము కూర్చుటకు నాచిత్తము సమ్మతింపకయున్నది. బ్రతిమాలి యైనను తురగమును గ్రహించి వీరిని బాపివేయవలెను. మీరేదికోరిన నది యొసంగెదఁగాక! బాలకులారా!

తే. గీ. కరులొ కాంచనంబొ మణి ♦ హారులొ పసిడి
రథములొ శాల్వలొ ఘన ♦ రత్నతతియొ
కోరుకొం డింక నొసగెద ♦ కొమరులార
మహిత క్రతువాజి విడుపుడు ♦ మాట లేల.

లవు—

తే. గీ. రాజవౌటచే మాకు వి ♦ రాజలీల
దానముల నొసంగగలవు ♦ ధరణిపాల
వానికోసము మాకేమి ♦ పని, రణంబె
దానముగ గోరుచుంటిమి ♦ తప్పు కిడుమ.

కుశు—

తే. గీ. బిరుదుపట్టంబుపైనను ♦ వీరులున్న
బట్టవచ్చును మాకైతు ♦ వాజిననుచు
మీరు వ్రాయుట చేతనే ♦ మేము దాని
బట్టినాము మీసేనల ♦ గొట్టినాము.

రాజేంద్రా! మేము పట్టినపట్టు విడుచువారముకాము. శక్తియున్నచో యుద్ధముజేసి మమ్ముగెల్చి యశ్వమును దీసికొనిపొండు.

భర—(కోపముతో) ఓరీ! బాలులారా!

మ. నను నేమన్నను లెక్క సేయనని లో ♦ నన్ గాని, మా రామచం
ద్రుని, నారీతిని బల్కినట్టి మిములన్ ♦ దోర్గర్వముం దూల్చి, మా
ఘన యశ్వంబును గొంచు బోయెదను ♦ వేడ్కన్ ననుం జూడుడీ
మునులా ఘోరరణాంగణంబునను మ ♦ మ్ముం గూల్చువారెవ్వడన్

త్రిలోక పూజ్యుడగు మా యగ్రజుని నెవ్వనిగా భావించితిరో.

మ. అరవిందాప్తకులంబు పావనము సే ♦ యన్ బంక్తికంఠాది ము
ష్కర దైత్యాళిని గూల్ప నీగతి రమా ♦ కాంతుండె మర్త్యాకృతిన్
ధర జన్మించె నటం చెఱుంగుడిక నీ ♦ తానాథునిన్ బాలకుల్
నరయశ్వంబును నిచ్చి వాని పదముల్ ♦ పట్టుండు మీరందరున్.

ఈతడు సామాన్య పరాక్రమవంతుడు గాడు.

తే. గీ. పసితనంబందె తాటకి ♦ పస యడంచె
కఠినదైత్యుల గెల్చి యా ♦ గమును గాచె
వాలి నొకకోలచేతనే ♦ గూలనేసె
బంక్తికంఠుని గూల్చి దే ♦ వతల గాచె.

లవు—సరి సరి. ఇతడా! రామాయణములో జెప్పబడిన శ్రీరాముడా! ఇంతవరకును నెవ్వరో యనుకొంటిమి.

చ. సమరము జేసి చేసి కడు ♦ శాంతివహించిన రాము గెల్చుటో
యమరవిరోధికాంతఘన ♦ మంచు దలంపక గూలనేయుటో
సమరము సేయలేక యటు ♦ చాటున దాగుచు వాలి గూల్చుటో
యమితపరాక్రమైకధను ♦ లౌ మము గెల్చుట నీకు శక్యమే.

కుశు— సోదరా! శ్రీరాముని ప్రతాపము మనము రామాయణమున జదివిన సంగతి నీవు మఱచిపోయితివా?

తే. గీ. వనచరుల సాయముం గాంచి ♦ వార్ధిగట్టి
లంకజొచ్చి దైత్యుల రేని ♦ బంకమార్చె
నెట్టి విక్రమవంతుడో ♦ యెఱుగ వేల
పరసహాయమున నితండు ♦ బఱగు గాదె.

భర—అన్నయ్యా! ముక్కుపచ్చలారని వీరినుడులతో నేమిపనియు న్నది. మన యశ్వమును మనము తీసికొనిపోవుదము. వీరేమి చేయగలరు? (గుఱ్ఱమును సమీపించుచున్నారు)

కుశ—నృపాలా! ప్రాణములపై యాశవదలుకొని గుఱ్ఱమును డాయుము. (భరతుని నడ్డగించును)

శ్రీరా—

తే. గీ. నరకులంబునుజూడ భూ ♦ సురులు మీరు
వట్టిమాటలెగాని మా ♦ వయసు లేదు
కలిత రణరంగ మన్నను ♦ తెలియదయ్యొ
సంగరంబేల మాతోడ ♦ సలుపుటేడ.

బాలకులారా! మీ యవివేకపుమాటలను మాని మాహయమును విడిచిపెట్టుడు.

లవు—అయ్యా! మాపై నింతనిర్హేతుకజాయమానకటాక్షమేల.

చ. సమరతలంబుజొచ్చి వెస ♦ శాత్రవవీరుల గూల్పకుండ శౌ
ర్యముగల మేము పోవుదుమె ♦ యాత్రిపురారియు వచ్చెనేని డెం
దముల భయంబు గాంచక ము ♦ దంబున దాకి జయంబు గాంచి మే
మమలయశంబు గాంచెదము ♦ నద్భుత శౌర్య పరాక్రమంబునన్.

భర—మీతో సామవాక్యములు పలికిన కొలది మీ సంభావణ హెచ్చుచున్నది. పసికూనలగుటచే మేము మీ సేనుము గోరిచెప్పితిమి. మావాక్యములు మీరు వినకుండిరి. ఇక మీ యెడల దయదలంపము.

కుశ—

ఉ. ఇంతకుముందె మీరు పచ ♦ యించి రనేకవిధాల, యెందుకీ
భ్రాంతి రణంబు వీడుదుమె ♦ రాజితశౌర్యము బూనివచ్చి మా

పంతము దీర్చుకొందుము నృ ♦ పాలక మాటలతో బనేమి; కా
సంతయు జంకులేదు ఘన ♦ సంశయమేటికి మమ్ము డాకుమా.

లవు—అన్నయ్యా ! ఎంతపిల్చినను వీరు రణంబునకు గడంగక యున్నా
రేమి. (రాముని భరతుని జూచి) ఓరీ ! భూపాలులారా !

చ. తమ్ములచావుజూచి కన్ను ♦ దమ్ములనీరము గార్చుచుంటి మిం
కెమ్మెయి మిమ్ము బోరున జ ♦ యించెదమంచు దలంతు రేని; చి
త్తమున సంశయింపక ము ♦ దమ్మున మాశరణంబు బొందుడీ
యిమ్మహి మిమ్ము గాచెదను ♦ హీనకృపారస ముప్పతిల్లగన్.

కుశు—తమ్ముడా ! నీవట్లంటివిగాని వీరందుకు సమ్మతింతురా?

తే. గీ. మనల నిర్జించి యాగస ♦ మాప్తిజూతు
రట్లు గాకున్నను గాజి ♦ యందుగూలి
ముక్తికాంతా సంగమమును ♦ బొందజూతు
రంతకాని యాశరణంబు ♦ నాదబోరు.

ఒకవేళ వీరు శరణుబొందినను నేనువిడువను.

శ్రీరా—భరతా ! వీరవాక్పటిమకు మితము లేకయున్నది. ఇంక గాలహ
రణమునకు నాచిత్తము సైపదు. ఓరోరీ ! బాలకులారా !

చ. జనకునియందు భక్తియును ♦ సద్గురుసేవయు గల్గెనేని న్నే
ననయము ధర్మసంధుడను ♦ నౌదునయేని మదీయమాత స
జ్జనమత సాధ్వియేని మము ♦ జంపగ జూచెడు నాకుమార కా
గ్రిణుల గళంబుపైనను వి ♦ రాజిలు ! బాణమ ! వజ్రహారమై.

(ప్రయోగించును) బాణము వజ్రహారమగును.

శ్రీరా—ఈ యాశ్చర్యమేమి?

భర—దేవా ! ఇందాశ్చర్య మేమియు లేదు. (పైపద్యమును జదివి)
అని వక్కాణించి యున్నారు. ఈ కుమారులు మిమ్ముబోలి
యున్నారు. వీరు సీతాగర్భ సంభూతులనుటకు సంశయము లేదు.

వసి—వాల్మీ—నిజము. నిజము.
శ్రీరా—మునీంద్రులారా! వందనములు.
వసి—వాల్మీ—శుభమగుగాక!
కుశ-లవ—అయ్యో! పాతయపరాధము జేసితిమి. అక్కటా! ఈదోస మెట్లువాయును? మానిచంద్రులారా! వందనములు. తండ్రులారా! మాభక్తిపూర్వక ప్రణామంబులు.
శ్రీరా—విజయసిద్ధిరస్తు.
కుశు—

చ. అనఘచరిత్ర నీమహిమ ♦ సారయజాలక మూర్ఖబుద్ధి మా
జనకుడ వౌటయుం దలప ♦ జాలక చేసితిమయ్య తప్పు నె
మ్మనమున నాగ్రహింపక స ♦ మంచిత సత్కృపరాజిలంగ మా
జననిని మమ్ము గావు మిక ♦ సారసమిత్రకులాబ్ధిచంద్రమా

లవు—

తే. గీ. అయ్య వోకావ తెలియలే ♦ మైతిమయ్య
యయ్యవంచును మాకు దా ♦ తయ్య చెప్ప
బవరమున మిమ్ముదాకిన పాపమతుల
నరసి రక్షింపుమయ్య ద ♦ యానిధాన

కుశు—

ఉ. అయ్యనుజాపు చప్పుడపు ♦ డంచును నమ్మని వేడుచుందుమా
యయ్య మొగంబు మే మెఱుగ ♦ మైతిమి చూతు మొ లేదొయంచు మే
మియ్యెడ నుండ నేమి వచి ♦ యింతము మాదగు భాగ్యమట్లు మా
యయ్యను నిన్ను జూపె భళి ♦ రాఘువంశకులాబ్ధిచంద్రమా.

లవు—

తే. గీ. తండ్రి! జూపింపుమాయంచు ♦ దల్లి నడుగ
నామె చూపగలేకుంట ♦ నాత్మలందు

వగచుచుండంగ నేడు మా ♦ భాగ్యమెల్ల
సఫలతం గనె నినుజూడ ♦ జాలియుంట.

శ్రీరా——నేను కృతార్థుడనైతిని.

వాల్మీ——రామచంద్రా!

చ. తనయులు వీరటంచు మది ♦ దద్దయు జూచియుఁ జూడనట్టు లా
రణముఖ మందునిల్చితివి ♦ రామనృపాలక! గాకయున్న నా
జని రిపులన్ వధించు టది ♦ చెప్పగ శక్తులె నీకు నీయెడన్
ఘనయపరాధులైన సుతు ♦ లన్ క్షమియింపుము రాఘవాగ్రణీ.

నేను ఆశ్రమంబున లేకపోవుటచే నింతవఱకు వచ్చితి. తెలియక చేసిన నేరమును సైచి కుమారులను రక్షింపుము.

కుశు——తండ్రీ! నీవు సాక్షాద్భగవంతుఁడవు. నీవు జనించుటచేత మేము ధన్యులమైతిమి. మాజన్మలు పావనంబులు. మాయపరాధము సహింపుము.

శ్రీరా——వత్సలారా! ఎఱుగక జేసిన దానింగూర్చి యింతగా బ్రతిమాలవలయునా? నాయనలారా! నావలన మీకేమికావలయును.

లవు——తండ్రీ! పుత్రులయెడల ననుగ్రహించిరి. కావున విన్నవించుకొనుచుంటిమి.

చ. జనులటునింద సేయగను ♦ స్వాంతమునన్ భయమంది కానకున్
బనుపగ నీకునై మిగుల ♦ వంతలబొందుచు నెట్టులెట్టులో
తనయుల మమ్ము జూచుకొని ♦ తద్దయుప్రాణము నిల్పుకొన్న మా
జననిని వేగ్రహించి మము ♦ సాకుము నీకును భక్తి మ్రొక్కెదన్.

వసి——తనయుని ప్రార్థన మంగీకరింపకతప్పదు.

వాల్మీ——

తే. గీ. సద్గురుండైన యీతని ♦ శాసనంబు
ముద్దుకొమరుల కిచ్చిన ♦ భూరివరము

సత్వరంబుగ దీర్పగా ♦ జనకసుతను
వే గ్రహింపుమా శ్రీరామ ♦ పృథ్విపాల.

శ్రీరా—దేవా! వాల్మీకి మునిచంద్రా!

వాల్మీ—(ప్రక్కంజూచి) శిష్యా! నీ వరిగి శ్రీరామాజ్ఞగా దెలిపి సీతం దోడ్కొనిరమ్ము.

లవు—గురువర్యా! సమరతలమున నెఱుంగక మా పినతండ్రులను రణమున నేలబడ వేసినాము. వారు మరల ఖేదంబులదాల్చి మమ్ము జూడకయున్నచో మా తనువు లీభూమిపైనుండవు.

వాల్మీ—కుమారులారా! అటుజూడుడు. వా రింతకుమున్నె లేచి యిట్లు వచ్చుచున్నారు.

లక్ష్మ—శత్రు—(ప్రవేశింతురు)

కుశ—లవు—పినతండ్రులారా! వందనములు.

కుశ—

మ. అపరాధం బట్టి యుద్ధభూమిని మదీ ♦ యంబైన దుర్బుద్ధిచే
విపరీతంబుగ జేసినారము భవ ♦ ద్విఖ్యాతకారుణ్యదృ
ష్టిపథంబందున మమ్ము బెట్టగదగుఁ ♦ జేమోడ్చి ప్రార్థింతుమ
య్య; కవితాత్ముల జేయు డీసుతుల నె ♦ య్యం బార మీ రెయ్యెడన్

లవు—తండ్రులారా! క్షమింపుడు.

లక్ష్మ—వత్సలారా! మీయందు దోషము లేదు.

తే. గీ. జనకనందని పోలిక ♦ దనరు మిమ్ము
గాంచియును నామెయే మిమ్ము ♦ గనెన! యట్లె
యైన శరవిద్య వచ్చునె ♦ ట్లంచు మదిని
సంశయించుచు దిగినాడ ♦ సమరమునకు.

శత్రు—వత్సలారా! సీతాకుమారులని యెఱయలేక సంగరంబున మీపైకి మహోగ్రుండనై లంఘించి గాసిల్ల జేసితినిగదా?

భర—

మ. శరసంధానము; మాటతీరు, మఱియా ♦ చండాంశు తేజంబు సొం
పరయన్ జాలియు సీత పుత్రులనుచున్ ♦ భావించి యుద్ధానికిన్
ధరణీశాగ్రణికిన్ వచింపనయితిన్ ♦ తథ్యంబొ కాదో యటం
చరయన్ సందియమాటచే దనయులా ♦ రా! మోసమయ్యెంజుడీ.

లవు—

తే. గీ; బ్రాహ్మణుల మంచు గడుపని ♦ వారలంచు
కొంతకరుణ బూనుచు నూర ♦ కుండ్రిగాని
గాక యుండిన మిమ్ము జ ♦ గంబునందు
దాక గలవారలెవ్వరు ♦ తండ్రులార!

కుశు—

తే. గీ. భయద సంగరభూమి కు ♦ మారవరుల
శౌర్య విక్రమంబును జూడ ♦ సంతసంబు
గలిగి యిట్లొనర్చిరి గాని ♦ కలిత విక్ర
మాఢ్యులమె మేము మీముందు. ♦ నయ్యలార!

లవు—తండ్రీ!

తే. గీ. తనయులను సాకుచు ఘన వి ♦ ద్యల నొసంగి
యవరు రక్షింతురో యంచు ♦ నేడ్చుతల్లి
కభయమిచ్చి మమ్ములను వి ♦ ద్యా నిధులుగ
జేసిన మునీంద్రు నుతియింప ♦ జెల్లు మాకు.

శ్రీరా—(వాల్మీకినిఁ జూచి)

సీ. రామాయణంబను పేర ♦ రామ చరిత్రమున్
జేసి నాకు యశంబు ♦ నిలిపినావు
నడుకానఁ జిక్కిన ♦ నారీశిరోమణిన్
గాపాడి రక్షించిన ♦ ఘనుడ వీవె

పంకజ హితవర ♦ వంశవర్ధనులకు
గరిమ విద్య లొసగు ♦ గురుడ వీవె
రణరంగమందున ♦ బాణముల్ విడిచిన
తమ్ములంగాచిన ♦ బమ్మ వీవె

తే. గీ. దుఃఖవారాశిలో మున్గి ♦ శోచకుండ
గొట్టుకొనుచున్న మమ్ముల ♦ గూర్మితోడ
నరసిన ఘనుండవీవె, ఓ ♦ యనఘ! నీకు
బ్రత్యుపకృతి జేయగలేను ♦ ప్రణుతితప్ప.

వాల్మీ—రామా! నన్ను శ్లాఘింపవలదు.

శ్రీరా—(పుత్రులను దగ్గఱకుదీసి) వత్సలారా! ఎప్పుడు సుత్రోదయ మైనదను వార్త విని నాతపంబుఫలించెననితలంతునో, ఎప్పుడు బ్రాకులాడుచు జేతులుజాపు తనూభవుని ముద్దాడ గందునో, ఎప్పుడు కుమారుని నంకపీఠమున నిలుపుకొని ముద్దాడు దునో, ఎప్పుడు నీనులకు విందుసేయు కుమారుని భాషణంబుల విందునో, యని సంతసించుచున్నందుకు మీతల్లి గర్భవతియై నది. దానికి మహామోదమునందుచుండగా లోకనింద కొంత యంతరాయముగలిగించినది. అరణ్యములకంపఁబడిన మీయంబ బ్రతికియున్నదో లేదో సుత్రోదయము గాంచెనో లేదో యని పరితపించుచున్న నాకు మీయిరువురి జననము జననమేకాదు. సమస్త విద్యావిభవ సమగ్రులైన మిమ్ము వాల్మీకి కరుణచే గాంచగల్గితిని. ఇప్పుడు నాసంతోషమునకు మేరలేదు.

సీత—(ప్రవేశించి) ప్రాణేశ్వరా! వందనములు.

చ. వనముల కీవు పంపఁ జని ♦ భావమునందున గుందుచుండి నా
హినిఁబడి నాదు ప్రాణముల ♦ నెట్టటొ గోల్పడనెంచియుండ నీ

మునివరు డడ్డమాచు గొని ♦ పోయి కుటీరము జేర్చి కాచె, నీ
తనయులగాంచి నిల్పితిని ♦ తథ్యముగా నుసురుల్ మనోహరా.

శ్రీరా—దేవీ!

సీ. కల్యాణి మదిలోద ♦ గరుణ బూనక నాదు
భూరి కానలకు గొం ♦ పోయినాడ
మాయాఁ కురంగంబు ♦ భ్రమియింపఁ జేయక
యడవిలో నిఁ బాసి ♦ యరిగినాడ
శంక యింతయు లేక ♦ లంకలోపల నగ్ని
బడుమంచు నీతోడ ♦ నుడివినాడ
నిండుగర్భిణివైన ♦ నెలతను నిన్ను నిం
దలకోడి కష్టముల్ ♦ గొలిపినాడ

తే. గీ. కఠిక చిత్తుడటంచును ♦ గాంత నన్ను
దలపకుండంగ వాసి జ ♦ త్తమున మఱచి
మేలుకొమ్మింక కోరిక ♦ లెల్లదీర
సరస సద్గుణ గాత్రి యో ♦ జనకపుత్రి.

సీత—దేవా! నీవట్లు చెప్పవలదు. నేను మీపాద సేవకురాలను.

వసి—వాల్మీకు డుండగనే కుశలవపట్టాభిషేకము చేయవలయును.

శ్రీరా—చిత్తము.

ఇది షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.



| | |
|---|---|
| సీతాకల్యాణము రా॥ సీ॥ | 0- 8-0 |
| శివాజివిజయము శే॥ రా॥ | 1- 0-0 |
| ప్రహ్లాద | 1- 0-0 |
| రామరావణసంగ్రామము వే॥ యు॥ | 1- 0-0 |
| లంకాదహనము ,, | 1- 0-0 |
| మహాభారతము సం॥ శే॥ | 1- 4-0 |
| చిత్తూరు ముట్టడి | 0-12-0 |
| సంపూర్ణ శ్రీకృష్ణచరిత్ర | 1- 0-0 |
| తులసీదేవి ము॥ చె॥ | 1- 0-0 |
| సతీతులసి ద్రో॥ సీ॥ | 1- 4-0 |
| ముక్తావళి కొం॥ భ | 0-10-0 |
| మాళవిక ము॥ చం॥ | 0-12-0 |
| ప్రభాకర జ॥ ల॥ | 0- 8-0 |
| సురాజుద్దౌల | 0- 8-0 |
| హాస్యపుపాటలు | 0- 6-0 |
| ప్రమదామనోహరము | 0-10-0 |
| శ్రీరామప్రవాసము ద్రో॥ సీ॥ | 0- 8-0 |
| శ్రీరామోద్యోగము ,, | 0- 8-0 |
| శ్రీరామవిజయము ,, | 0- 8-0 |
| శ్రీరామాశ్వమేధము ,, | 0- 8-0 |
| హస్తినాపురము ,, | 0-12-0 |
| రాయచూరు ముట్టడి ,, | 0- 8-0 |
| శ్రీనివాసకల్యాణము ,, | 0- 8-0 |
| రసపుత్రవిజయము ,, | 1- 0-0 |
| సారంగధర ,, | 0-12-0 |
| విజయబొబ్బిలి ,, | 0-12-0 |
| వేశ్యామధురము పా I ,, | 1- 0-0 |
| వేశ్యామధురము పా II ,, | 0-12-0 |
| విచిత్రచిత్రమాల అ॥ సో॥ | 0-12-0 |
| నవరత్నచింతామణి | 1- 0-0 |
| అనసూయ | 1- 0-0 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥ కృ॥ | 1- 0-0 |
| వేణీసంహారము కా॥ సు॥ | 1- 0-0 |
| విక్రమోర్వశీయము ,, | 0- 8-0 |
| చండకౌశికము ,, | 0-10-0 |
| అభిజ్ఞానశకుంతల ,, | 1- 0-0 |
| సంపూర్ణోత్తరరామాయణం రా॥ శా॥ | 1- 4-0 |
| శశికళ వి॥ సు॥ | 0-12-0 |
| సారంగధర | 0-12-0 |
| సువర్ణపాత్రి రా॥ శా॥ | 1- 0-0 |
| సుమతీదేవి బ॥ కొ॥ | 0-12-0 |
| సంపూర్ణభారతము శి॥ న॥ | 1- 4-0 |
| భక్త కబీర్ కొ॥ సు॥ | 1- 0-0 |
| పాదుకాపట్టాభిషేకం | 1- 0-0 |
| శ్రీకృష్ణతులాభారము ద్రో॥ సీ॥ | 0-12-0 |
| కనకతార | 0-10-0 |
| సౌగంధికము గుం॥ జ॥ | 0- 8-0 |
| మాతృదాస్యవిమోచనము | 0-12-0 |
| సంస్కారిణి దా॥ పుం॥ | 1- 0-0 |
| సత్యహరిశ్చంద్ర కా॥ వీ॥ | 0-12-0 |
| లంకాదహనము | 0- 8-0 |
| స్త్రీసాహసము | 0-12-0 |
| సీతామనోహరము | 0- 8-0 |
| భీమప్రతిజ్ఞ క॥ కొ॥ | 0-12-0 |
| కబీర్దాసీయము శే॥ రా॥ | 0-12-0 |
| కృష్ణరాయవిజయము | 0-12-0 |
| ఫాలాఫ్ విజయనగర్ | 0-12-0 |
| సంపూర్ణ భాగవతము | 1- 0-0 |
| తపతీసంవరణము కా॥ కొం॥ | 1- 0-0 |
| శారదావిజయము కొ॥ సు॥ | 0-12-0 |
| రుక్మిణీకల్యాణము జి॥ జా॥ | 1- 0-0 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1- 2-0 |
| సత్రాజితీయము ,, | 0-14-0 |
| బుద్ధిమతీవిలాసము ,, | 1- 0-0 |
| ఉత్తరరాఘవము బ॥ ల॥ | 1- 4-0 |
| జయంతజయపాల అ॥ సు॥ | 0-12-0 |
| రసపుత్రవిజయము ఇ॥ య॥ | 1- 0-0 |
| రాణాప్రతాపసింగ్ | 1- 0-0 |
| ప్రతాపరుద్రీయము వే॥ వెం॥ | 1- 8-0 |
| కన్యాశుల్కము గు॥ అ॥ | 1- 0-0 |
| రోషనారా కో॥ సు॥ | 1- 4-0 |
| గులేబకావళి అ॥ సుం॥ | 1- 0-0 |

# మహానంద

గ్రంథకర్త: బద్దిరెడ్డి కోటేశ్వరరావు.

ఈ చరిత్రము పురాణగాథకు భిన్నంబుగాకుండ బయాస్కోపు స్లాటు ననుసరించి మృదుమధురశైలిని చక్కని గద్యపద్యములతో వ్రాయబడిన నాటకరాజము. శైలిజూడుడు.

సీ. సంసారమనెడి వృ ♦ క్షమ్మున కొనరింప
భీకరకాతాసి ♦ వేశ్యవృత్తి
లక్షాధికారుల ♦ భిక్షులుగా జేయ
ప్రథిత విక్రమశక్తి ♦ కడుపువృత్తి
భార్యబిడ్డల కెడ ♦ బాటు గల్పింపగా
గడుతంత్రజాలంబు ♦ గణికవృత్తి
కడురోగములచేతఁ ♦ గాటికి జేర్పంగ
రహివశాలపుమిత్తి ♦ లంజవృత్తి

గీ. మంతనములాడి విటులను ♦ గొంతుగోయ
సానబట్టిన సురకత్తి ♦ సానివృత్తి
కపట ప్రేమభావములచేత ♦ గడనసేయ
చండతరమూర్తి యావ్యాధి ♦ చానవృత్తి

మ. సురలోకేశ్వర! రాగదూరయయి యీ ♦ శుండొల్లు కాంతావతిన్
కెలబట్టంగ దలంచితేని విబుధుల్ ♦ ఛీ! యనుచు దూషింపరే?
విరక్తిప్రభ కెల్లమాయువె? ఘన ♦ శ్రీకెల్లఁ గోల్పోవవే?
నరకప్రాప్తిని జెందవే? చెడవె? ♦ నామాట లాలింపవే!

వెల 1—0—0.

**కందుల గోవిందం,**
బుక్కుసెల్లర్ అండ్ పబ్లిషర్,
బెజవాడ, కృష్ణాజిల్లా.